# తిరుమల తిరుపతి దేవస్థానముల విషయములు

— ✻✻✻ —

## తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకవర్గము

అధ్యక్షులు: శ్రీ చెలికాని అన్నారావు, బి. ఏ.,

సభ్యులు:

1. శ్రీ యస్. సి. నాగిరెడ్డి ఎమ్. యల్. ఏ.
2. శ్రీ వి. రామస్వామిరెడ్డి
3. శ్రీ జి. రామచంద్రారెడ్డి ఎమ్. యల్. సి.
4. శ్రీ సి. రామలింగేశ్వరరావు.
5. శ్రీ డి. యస్. రాజు
6. శ్రీ మాగంటి అంకినీడు, ఎమ్. పి.
7. శ్రీ యస్. రాధాకృష్ణ.
8. శ్రీ యల్. నారాయణ. ఎమ్. యల్. ఏ.
9. శ్రీమతి జి. కమలాదేవి. ,,
10. ,, సుమిత్రాదేవి. ,,

కార్యనిర్వాహణాధికారి మరియు గౌరవనీయ సంపాదకుడు,
శ్రీ పి. యస్. రాజగోపాలరాజు, బి.ఏ., బి.యల్.,

## యాత్రికుల వివరములు

★ ★ ★

జనవరి—1975

| | | |
|---|---|---|
| కనుమదారి బస్సుయందు ప్రయాణము చేసినవారు | పెద్దలు | ... 4,47,465 |
| | పిల్లలు | ... 27,281 |
| సత్రములో నివసించిన యాత్రికుల సంఖ్య | తిరుపతి | ... 68,967 |
| | తిరుమల | ... 1,28,810 |
| కనుమదారిద్వారా తిరుమలకు ప్రయాణము చేసిన వాహనములు | మోటారుకారు | ... 6,576 |
| | మోటారుసైకిళ్లు | ... 394 |

# శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య వర్ధంత్యుత్సవము



పదకవితా పితామహుని సంస్మరణోత్సవము **8–4–75** న
అన్నమాచార్య కళామందిరములో జరుగును.
రసజ్ఞులకు, చక్కని అవకాశము.



# సప్తగిరి

సంపుటి 5] మార్చి 1975 [సంచిక 10

గౌరవ సంపాదకులు :

శ్రీ పి. యస్. రాజగోపాలరాజు బి.ఏ., బి.ఎల్.,

కార్యనిర్వాహణాధికారి

★

ప్రచురణకర్త ; సంపాదకుడు :

కె. సుబ్బారావు ఎమ్. ఎ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నం. 2254

★

ముద్రాపకుడు :

ఎమ్. విజయకుమార్‌రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

★

సంవత్సర చందా రూ. 6/-

విడిప్రతి :- 50 పైసలు

★

పత్రిక ప్రతులకు, ఇతర విషయములకు.

సంపాదకుడు,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి,

## విషయ సూచిక

# సంపాదకీయం

—⁕⁕—

ఉప్పొంగే మానవ భావపరంపరలను, ప్రశాంత వాతావరణంలో క్రమబద్ధం చేసి, కలకాలం కన్నులకు కట్టినట్లు వర్ణించే ప్రక్రియ సాహిత్యమైతే, ఈ సాహిత్యపు మెట్లపైన, వర్ణనకందని భావతరంగాలను లయబద్ధంగా ప్రస్తరించి రాగాను సంధానం చేసి, నాద బ్రహ్మోపాసనచేసే ప్రక్రియ సంగీతం. ఆలోచనామృతమైన దొకటిగ ఆపాత మధురమైన దొకటిగ ఇరుమార్గముల కురుకు ఈ జవనాశ్వముల జంటపై సారథ్యము నెరపగలరువారు. కోటికొక్కరుందురేమో! ఆ కొందరిలో మొదటి స్థానము తాళ్ళపాక అన్నమయ్యదే అనక తప్పదు.

వర్ణన భావుకతకు లక్షణము. కాని తన ఏలుగడ శ్రీ వేంకటేశుని, శృంగార రసైకమూర్తిగా, మూర్తిగొన్న ఆధ్యాత్మిక శక్తిగా, ముప్పది రెండువేల కీర్తనలలో వర్ణింప గల్గిన అన్నమయ్య భావుకత, ఏ వర్ణనకు నందనిది. సాహిత్యపు సొరు సంగతె టున్నను సంకీర్తనముల సంఖ్యయేచాలు, అన్నమయ్యను పదకవితా పితామహుడనుటకు.

ఏ కోణమున చూచినను, భారతీయ పద సాహిత్య చరిత్రలో అన్నమయ్య ఒక ధ్రువతార. త్యాగరాజు, క్షేత్రయ్యలవంటి వారి కృతులు తరువాత తరముల వారికిగాను వెదకి భద్రపరుపబడిన, పులుగడిగిన ముత్యములు, రాటుదేలిన రత్నముల వంటివి గాగా అన్నమాచార్య సాహిత్యము అగాధసాగరమై యీదగల చేవగలవారు యోగ్యతకొద్ది చేకొనవచ్చునని, చేసాచి పిల్చుచున్నట్లుండును. ఈ సాగర మింతవర కజ్ఞాతముగ నుండుట కిదే పెద్దకారణమేమో.

దేవస్థానము ఏటేటా (ఈ ఏట ఏప్రియల్ 8 వ) జరుపు వర్ధంత్యుత్సవములు గాని, కీర్తనల ప్రచురణగాని, స్మారకమందిర స్థాపనలుగాని, ఆయనకు, అనుకోదగ్గ గౌరవములు గాదుగాని, నా వలననే నీవు కీర్తిబొందేవని వేంకటేశు తోడనే పంతగించెడి కొండంతమనసున్న మనీషికి, ఈ గోరంత కృతజ్ఞతయైన చూపగల్గితిమన్న ఆత్మ తృప్తికి మాత్రమే.

ఆయన సాహిత్యమును భళియన్న నది ఆయనకు సన్మానము మాత్రముకాదు. కాలగతి కనుగతిగా మారుటే స్వభావముగల మానవులలో, రక్తి మూలమున భక్తిముక్తు లకు కొత్తబాట లేర్పరచిన ఆ రసయోగిని, ఆ మహనీయుని మరువలేని మనసు మన కింకను మిగిలియున్నదని మనవి చేసుకొనుటకు మాత్రమే.

# వార్తాలహరి

## తిరుమలలో రవిశంకర్

తన సితారు వాద్యముతో యావత్ప్రపంచమును ఉఱ్ఱూత లూగింప చేసిన పండిత రవిశంకర్ 10-2-75 తారీకున శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సందర్శించి సితార్ వాద్య కచ్చేరి చేశారు.

ఆయన సితార్ వాద్య కళా వైదగ్ధ్యము శ్రోతలను ఒకఆనంద లహరిలోముంచెత్తింది. అనిర్వచనీయ ఉత్తేజక స్థితిలో ఆటలాడించింది. దర్బారి కన్నడ రాగంలో ఆయన పలికించిన స్వరముల వైశిష్ట్యం నిజంగా వర్ణనాతీతం.

సంగీతకళాభివృద్ధికి వినియోగ పరచుటకుగాను, పండిత రవిశంకర్ దేవస్థానంవారికి రు. 10,000/- చెక్కును ఇచ్చారు. ఆయన తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన వాద్య విద్వాంసులు కూడా.

## శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దర్శన వేళలు

ఈ మాసము 1 తేదీనుండి అమలులో వున్న శ్రీవారి దర్శనాదిక కార్యక్రమములలో గమనించ దగిన ముఖ్యాంశములు చాల ఉన్నవి.

ఈ కార్యక్రమము ప్రకారము సుప్రభాతం ఉదయం గం॥ 2-30 లకు ప్రారంభమౌతుంది. సర్వ దర్శనాన్నికూడ 3-00 నుండి 4 గం॥ 6-00 నుండి



పండిత రవిశంకర్ సితార్ వాద్యబృందము

12-30; సాయంకాలం 1 నుండి 6-30 రాత్రి 7 నుండి 10-00 ల వరకు నాలుగు మార్లుగా ఏర్పాట్లు చేయుట జరిగినది. అనగా దాదాపు 16 గంటల కాలం సర్వదర్శనమునకు కేటాయించుట జరిగింది. మరియొక ముఖ్యాంశము. శుక్రవారంనాడు సర్వదర్శనం వేళలను పెంచటం జరిగింది. ఇంతవరకు శుక్రవారంనాడు సర్వదర్శనం మధ్యాహ్నం మీద ఒక 6 గంటలపాటు జరిగేది. క్రొత్తకార్యక్రమము ప్రకారము శుక్రవారము కూడా సుప్రభాతం గం॥ 2-30 లకు జరిగి, సర్వదర్శనము ఉదయం గం॥ 3-00 నుండి గం॥ 4-00; సాయంకాలం గం॥ 2-00 ల నుండి గం॥ 7-00 ల వరకు; రాత్రి గం॥ 8 నుండి 10 గంటల వరకు అనగా షుమారు 8 గంటలకు పైగా ఏర్పాటైనది. ఈ మార్పుల వలన భక్తులసంఖ్య అధికముగా శుక్రవారములలో శ్రీవారిని దర్శించుటకు వీలవుతున్నది.

## తిరుమలలో ప్లవ ఉత్సవము

శ్రీ వేంకటేశ్వర స్వామివారి వార్షిక ప్లవ ఉత్సవము ముక్కోటి దేవతలను పవిత్ర మొనరించే శ్రీ స్వామి పుష్కరిణియందు 23-3-75 నుండి 27-3-75 వరకు జరుగును. మొదటి రోజున శ్రీ కోదండ రామస్వామి వారు, రెండవనాడు శ్రీ కృష్ణస్వామి వారు మూడవరోజు మిగిలిన మూడు దినములును కలియుగ వైకుంఠస్వామి యగు శ్రీ వేంకటేశ్వరులు దేవేరులతోగూడి, వివిధములైన విద్యుద్దీపాలంకరణములతో మెరియు తెప్ప మీద వాహ్యాళి ఉత్సవము జరుపుకొని, భక్తకోటికి ఆశీర్వచనముల నొసంగి దర్శనమిస్తారు.

## ధర్మకర్తల మండలి తీర్మానములు

తిరుమలలో పనిచేయు దేవస్థానం ఉద్యోగుల బిడ్డలు తిరుపతిలో విద్యాభ్యాసమునకు పోయి వచ్చుటకువీలుగా, మాసమునకగు ఛార్జిలో 1/5వ వంతుపై 'కన్సెషన్ పాస్'లు ఇవ్వాలని నిర్ణయించింది.

నాల్గవ వర్గము ఉద్యోగస్థులలో స్త్రీలకు రెండు చీరలు, రెండు రవికలు, పురుషులకు రెండు జతల కాకీ, యూనిఫారంగా ఇవ్వవలయునని, ఇస్త్రీకి గాను వగైరాలు నెలకు రు. 5 ఇవ్వవలయునని నిర్ణయించింది.

దేవస్థానం ఉద్యోగులకు గాను గృహములు నిర్మించి, వానికి వాయిదాల పెట్టుబడిలో తీర్చుకొను పద్ధతి మీద ఆ గృహములను వారికి స్వాధీనం చేయవలెనని సూత్రప్రాయముగా అంగీకరించింది.

కొండమీద నివాసమునకు గాను దేవస్థానం ఉద్యోగులకు ఇచ్చుచున్న అలవెన్సు ఇప్పటికన్న 50% 1-1-75 నుండి పెంచవలెనని, ఈ పైకము కమీషనర్ ఉత్తర్వు అనంతరమే ఇవ్వవలెనని నిర్ణయించినది.

దేవస్థాన ఉద్యోగులందరికి కేంద్రప్రభుత్వ జీతములను ఇచ్చుటకు సిఫార్సు చేసింది.

దేవస్థానం ఉద్యోగాల విషయములో మొత్తం ఖాళీలలో 50% అర్హులైన దేవస్థాన ఉద్యోగులకు ఇవ్వవలయునని, మిగిలిన 50% బయటనుండి తీసి కొనవలెనని, గరిష్ఠ వయః పరిమితిని 45 పెంచవలెనని నిర్ణయించింది.

శ్రీ కె. వేణుగోపాల్ నాయుడును తిరుమల తిరుపతి దేవస్థానములో అక్కౌంటు ఆఫీసరుగా గణాంకాధికారిగా నియమించారు.

—

తిరుమల తిరుపతి దేవస్థానము శ్రీ వేంకటేశ్వర స్వామివారికి సంబంధించిన ఈక్రింది పటములకు విక్రయమునకు ధరలు నిర్ణీతమైనది.

| | ధరలు |
|---|---|
| 1. శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఎనామిల్ చిత్రము 1¼'' వెండి ఫ్రేముతో నున్నది. | 100 |
| 2. శ్రీ పద్మావతీదేవి ఎనామిల్ ఫోటో వెండి ఫ్రేముతో నున్నది | 100/– |
| 3. శ్రీ వేంకటేశ్వర పద్మావతిదేవితో గూడిన ఎనామిల్ చిత్రపటము | 225/– |

తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ధర్మశాల, గోవిందరాజ, పద్మావతి దేవిల ఆలయములు. తిరుమలలోని దేవస్థానము పుస్తక విక్రయశాలలో లభ్యమగును.

---



విశ్వహిందు పరిషత్ ఆవరణలో దేవస్థానముల పుస్తకముల విక్రయశాల

## సూర్యపూజా మహోత్సవము

మత్స్యావతారుడైన శ్రీమహా విష్ణువు రాక్షస సంహారము గావించి, వేదముల నుద్ధరించి వేద కిచ్చిన పవిత్రస్థలము నాగలాపురంలోని వేద నారాయణ స్వామివారికి సూర్యపూజా మహోత్సవం మూడు రోజుల పాటుగా 25 నుండి 27 వరకు అతి వైభవముగా జరుగబోతున్నది.

ఈ విశ్వమునకు ప్రత్యక్ష దైవము సూర్యభగవానుడు మీన మాసములోని 12, 13, 14 వ దినములలో అనగా మార్చినెల 25, 26, 27 తేదీలలో తన కరకిరణములతో, మొదటి దినమున శ్రీవారి పాదపద్మములను, రెండవనాడు నాభిని, మూడవ దినమున శ్రీవారి ముఖమండలమును స్పృశించి సంభావించుట జరుగును.

ఇదియేగాక ఈ మూడుదినములు వేదనారాయణ స్వామివారికి, వారిదేవేరులతోఁగూడ సమీప పుష్కరిణిలో ప్లవోత్సవము జరుగును. మొదటినాడు శ్రీ సీతాసమేత శ్రీ రామచంద్రస్వామి వారికి, మిగిలిన రెండు రోజులలో వేదనారాయణస్వామి వారికి, ఈ ప్లవోత్సవం జరుగుతుంది.

శ్రీ వేంకటేశ్వరస్వామి వెలసిన తిరుమలనుండి శ్రీ వేంకటపతి పద్మావతీ విభుడైనచోటు నారాయణవనం మీదుగా, ఈ నాగలాపురమునకు దేవస్థానం బస్సు సౌకర్యము కలదు. భక్తులందరికి నిదియొక సదవకాశము.

---

అనాదిగా వస్తున్న భక్తి విశ్వాసాలపై విధి మరల విజయం సాధించింది. 17–2–75 తేదీనాడు సుమారు యాత్రికులతో తిరుమలకు వెళ్తున్న ఏ. పి. సి. 5242, రెండవ ఘాట్ రోడ్డులో ఒక గోడకు ఢీకొని, 200 గజముల క్రిందికి దొర్లిపోయింది. ఈ దుర్ఘటనలో క్రింద పేర్కొన్న ఆరుగురు ప్రాణములు కోల్పోవుట జరిగింది. అందులో ముగ్గురు ప్రమాద స్థలములోనే మరణించుటజరిగినది,

1) యం. వెంకటయ్య (డ్రైవరు)
2) చంద్రయ్య, బిచ్చాల పోస్టు (ఆం. ప్ర)
3) బోగయ్య ఎలమందేర్ (కర్ణాటక)
4) రంగనాథయ్య ఎరుసువాడి (కర్ణాటక)
5) దంట్ల కృష్ణయ్య దామోదర మహారాజపురం (చిత్తూరు జిల్లా)
6) బాలమ్మ శిబ్బాల (పో); మహబూబ్‌నగర్ జిల్లా.

ఎనిమిది మందికి తీవ్రమైన గాయములు తగిలినవి.

దేవస్థానము మృతుల కొక్కొరికిగాను రు. 2000 వారి కుటుంబాలకు తీవ్రంగా గాయపడిన వారికి ఒక్కొక్కరికి రు. 1000, స్వల్పముగా గాయములు తగిలిన వారికి ఒక్కొక్కరికి రు. 200 వంతున ఆర్థికసహాయము అందజేయటం జరిగింది.

స్థానము తన పరిధి మేరకు ఆర్థిక సహాయం, తదితర అత్యవసర సహాయాలు అందజేసింది. ఎవరు ఏమిచేసిన ఆ కుటుంబాలకు సంభవించిన ఆపద ఆ లోటు తీర్చలేనిది.

అసువులు కోల్పోయిన వారి ఆత్మలకు అనంత శాంతిని, మిగిలినవారికి, ఈ మూగబాధను తట్టుకోగల ధైర్య స్థైర్యాలను ప్రసాదించమని వేంకటేశ్వరుని వేడుకుందాం.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఆంధ్రప్రశస్తి

## దైవబలము

సీసమాలిక:

శ్రీవేంకటేశుండు - స్థిరనివాసుండయి
యేడుకొండలపైని - నెసఁగుచుండ
శ్రీరామ చంద్రుండు - సిరులిచ్చు తండ్రియై
భద్రాచలంబుపైఁ - జఱఁగుచుండ
శ్రీకాళహస్తీశ్వ - రాకార లింగంబు
కాళహస్తినిసదా - కలిగియుండ
శ్రీమల్లికార్జునుం - డోమఁగాఁ గరుణమై
శ్రీగిరి శిఖరాన - జెలఁగుచుండ
భీమేశ్వరస్వామి - క్షేమంబు నొసఁగంగ
ద్రాక్షారమందున - రతినుండ
లక్ష్మీనృసింహుండు - లఘుతర మూర్తియై
మంగళగిరిపైన - మసలుచుండ
అప్పల నరసింహుఁ - డెప్పుడేన్ బ్రోవంగ
సింహాచలంబుపైఁ - జేరియుండ
వీరవేంకటసత్య - నారాయణుం డన్న
వరమున రమతోడ - వరలుచుండ
కనక దుర్గాంబటుఁ - గరుణారసస్ఫూర్తి
నింద్ర కీలాద్రిని - నెంచియుండ

తే.గీ. హస్త యుగళిని జోడించి ప్రస్తుతింప
వరము లొసఁగఁబ్రత్యక్షదైవంబు లిటుల
అభయహస్తంబుఁ జూపుచుఁ - బ్రభవమొంది
యలర, నాంధ్రప్రశస్తికిఁ - గలదె కొఱంత?

— శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావు.
గుంటూరు.

# శ్రీ వేంకటేశ్వర వైభవము

ఆంగ్ల రచన
శ్రీ పండ్రిమలైస్వామి

తెలుగు అనువాదము
— శ్రీ బంకుపల్లె సూర్యనారాయణశాస్త్రి
గోపాలపురం

ఉత్తర భారతవాసులైన జనులు వేంకటేశ్వర అని బాలాజీ యని భగవంతుని వివిధ నామాలతో కీర్తింతురు. ఆ భగవంతుడే తిరుపతిలో తిరుమల గిరిపై సర్వశక్తి సంపన్నుడై వెలసినాడు. ఆ గిరియే వేంకటాద్రి యని పిలవబడును.

శ్లో॥ సర్వదేవతాత్మకో విష్ణుః వేంకటాచల నాయకః।
కలౌ స ఏవ సంసేవ్యః శ్రీపతిః పురుషోత్తమః॥

ఈ కలియుగంలో వేంకటాచల నాయకుడు విష్ణువే. అతడే లక్ష్మీపతి. సర్వదేవాత్మకుడు పరబ్రహ్మ.

పూర్వము ఋషులందరు గంగాతీరంలో యజ్ఞము చేయబోయి త్రిమూర్తులలో యజ్ఞ పురుషు డెవరవుతారు-అని వాదించుకొని త్రిమూర్తులను పరీక్షించే శక్తి లేక యూరకున్నారు. అప్పుడు భృగుమహర్షి లేచి నేను నిర్ణయిస్తానని సగర్వంగా అన్నారు. అతని పాదంలో జ్ఞాననేత్రం ఉంది. సత్యలోకంవెళ్ళి బ్రహ్మకు ఎదురుగా నిలుచున్నాడు. బ్రహ్మఅతనిని కసరి పొమ్మన్నాడు. అంతలో ఋషి ఏమయ్యా! రజోగుణంతో కూడినవాడవై నన్ను పొమ్మన్నావు. నీవు పూజార్హుడవు కాకుందువుగాక. అని శపించి పోయెను. కైలాసమునకు వెళ్ళెను. కైలాసములో మహేశ్వరుడు పార్వతితో క్రీడించుచుండెను. రుద్రుడు కోపోద్రిక్తుడై నీవునాయాజ్ఞ లేకుండ ఇక్కడి కేల వచ్చితివని దూషించెను. అంతలో ఋషి నీవు తమోగుణ యుక్తుడవై యున్నావు. నీకు పూజార్హత పార్వతితో లేక పోవుగాక - అని శపించి పోయెను. తిన్నగా అతడు వైకుంఠమున కేగెను. అక్కడ విష్ణువు లక్ష్మితో సరస సల్లాపము లాడు చుండెను. అట్టి సమయంలో భృగు మహర్షి చప్పున వెళ్ళి విష్ణు వక్షముపై దన్నెను. అంత విష్ణువు కోపం తెచ్చుకొనక స్వాగతవచనాలు పల్కుతూ అతని పాదాలు పట్టుకొని వినయము కనబరుచుచు కాలిలోనున్న జ్ఞాననేత్రం చితుకనొక్కెను. జ్ఞాననేత్రం పోయిన ముని తనఅపరాధం తెలుసుకొని విష్ణువును శరణువేడెను. విష్ణువు క్షమించెను. ఋషి గంగానదీతీరమునకువచ్చి పూజార్హుడువిష్ణువే. త్రిమూర్తులలో అతడే యజ్ఞ పురుషుడని చెప్పెను. లక్ష్మికి స్థానమైన విష్ణువక్ష స్థలాన్ని కాలితో తన్నిన ఋషిని శిక్షించకుండ విడచినందుకు లక్ష్మికికోపం వచ్చి శ్రీవిష్ణువును నాటినుండి విడిచిపెట్టెను.

లక్ష్మి వియోగంచేత దుఃఖించినవాడై మరల లక్ష్మితో నెప్పుడయిన కలి యనా యని వేంకట గిరియే అందుకు తగిన స్థానమని తలచి వేంకట గిరిపై నున్న స్వామిపుష్కరిణీ తీర్థమునకు పశ్చిమ తీరంలో ఒకపుట్టలో స్వామి వాసం చేయుచుండెను. ఆ పుట్టలో ఆకాశరాజుచేత చేయబడిన క్షీరాభిషేకముచే దృప్తుడై ప్రస్తుతము ఆకర్షణీయమైన విగ్రహముగ అర్చారూపము కలవాడై వెలసెను. అతడే వేంకటేశ్వరుడు. సృష్టిస్థితి లయకారకుడు స్వయంభూ వేంకటేశ్వరుడు త్రిమూర్త్యాత్మకుడు. 'వేంకట' అనేపదం బీజాక్షర సంపుటితం. వ-ఈం-క-ట-' అని. వ విష్ణు బీజం. ఈ మహామాయా

బీజరూపలక్ష్మి 'వేం' లక్ష్మీ విష్ణువుల కలసినరూపం లేదా ప్రకృతిపురుషులు కలసిన రూపం. క-బ్రహ్మ రూపం. ట- మహేశ్వరరూపం. ఇట్లు వేంకటేశ్వర పదం త్రిమూర్త్యాత్మకం. సర్వదేవతా ప్రధానం విష్ణురూపం. 'వేంకట' అన్నది పరమబిందు. ఇది సహస్రారంలో ఉంటుంది. అందుచేత వేంకటేశ్వరుడు పరాశక్తిరూపం.

వేంకటగిరి ఏడుకొండలు కలది. ఏడు కొండలు ఏడులోకాల దెల్పును. భూర్భువ స్వర్గమహః జన సత్యతపో లోకాలు. సప్తదేవతలను దెల్పును. బ్రహ్మ విష్ణు రుద్రమహేశ్వర సదాశివశక్తిపరాశక్తి రూపం. సప్తచక్రాలను కూడ చెప్పును. మూలాధారచక్రం స్వాధిష్ఠాన మణిపూర అనాహత విశుద్ధఅజ్ఞా సహస్రారములుఏడు. శ్రీచక్రపీఠముపై విష్ణువుంటాడు గనుక వేంకటగిరి శ్రీ విష్ణుస్థానం అయింది. శ్రీ పీఠంపై బాలాత్రిపుర సుందరి విజయం చేయును. అంచేత బాలాజీ యని కూడ అతనిని పిలిచెదరు. ఈ విధముగ శ్రీ వేంకటేశ్వరుడు విష్ణువు. భూతతత్వాత్మకుడైన రుద్రుడు కూడ. మూలాధారమునుండి విశుద్ధచక్ర పర్యంత ముండును. అనాహత చక్రములో పార్వతి హంస రూప నారాయణుడు. ప్రణవాకారము పరమ బిందుస్థానము అకార ఉకార మకార రూప ఓంకారము. సహస్రార చక్రములో నుండును.

మరియు వేంకటేశ్వరుడు షణ్ముఖుడనియు చెప్పుదురు. అతని జన్మనక్షత్రం శ్రవణం, సుబ్రహ్మణ్య జన్మనక్షత్రంకూడ శ్రవణం. శ్రీవేంకటేశ్వరుని వక్షమందుగల శ్రీవత్సము సుబ్రహ్మణ్య వక్షమందునను గలదు. సుబ్రహ్మణ్య వక్షమందుగల అమచ్చ దేవేంద్రుడు తనవజ్రాయుధముతో గొట్టిన దెబ్బ. అంచేత శ్రీ వేంకటేశ్వరుడు సుబ్రహ్మణ్య స్వామియని యందురు.

పైన చెప్పిన ప్రకారం శ్రీ వేంకటేశ్వర విగ్రహంలో రుద్ర, బాలాత్రిపురసుందరీ, సుబ్రహ్మణ్య విష్ణు చిహ్నాలున్నవి. అతడు సత్స్వరూపుడు. ఔపనిషదిక బ్రహ్మస్థితి రూపములో నుండును. భక్తులు ఆతనిని వివిధ రూపాలుగ భజింతురు. శైవులు హరుడని, హరియని, ఆల్వారులును. 'అశ్లే' శ్రీ వేంకటేశుని నామములలో 'కార్తికేయవపుర్ధరాయనమః' అని (నామములలో) చెప్పబడినది.

ఇతనిని శ్రీనివాస యనియు చెప్పుదురు. ఎందుచేతనంటే వేంకటగిరిలో శ్రీపీఠంలో ఉండడముచేత, ఆగిరికి శ్రీశైలం అనికూడ అంటారు. భారతదేశంలో భక్తులనందరిని ఆపీఠం ఆకర్షిస్తున్నది. శ్రీ మహాలక్ష్మి అవతారం పద్మావతి. ఆమే యితనిని వివాహమాడినది. నారాయణ వనంలో, ఆమె ఆకాశరాజుకూతురు. కోల్హాపురిలో మహాలక్ష్మి అర్చామూర్తినిజూచి శ్రీ వేంకటేశ్వరుడు అక్కడ కనిపెట్టియుండెను. ఆ మూర్తిని అగస్త్యమహర్షి ప్రతిష్ఠించెను. ఇట్లు పది సంవత్సరముల పర్యంతము ఆ ప్రభువు లక్ష్మిని పొందుటకు కనిపెట్టియుండెను.

ఇంతలో ఆకాశవాణి యిట్లు పలికెను. "స్వర్ణముఖినదికిబోయి అక్కడ ఉత్తరతీరంలో ఒక సరస్సును త్రవ్వి స్వర్ణపద్మాలుతెచ్చి ఆ సరస్సులో వేసిపెంచుము. ఏకాక్షరి లేక శతాక్షరి మంత్రంతో మహాలక్ష్మిని ధ్యానించు. స్వర్ణపద్మాలతో ఆమెను పూజించు." అని ఆ ప్రకారం విష్ణువు చేయగా స్వర్ణపద్మాలు పోషించడంలో

సూర్యభగవానుడు అతనికి తోడుపడగా అట్లు పన్రెండేండ్లు గడచినవి.

ఒకనాడు కార్తికమాసం శుక్లపక్షం పంచమీ శుక్రవారం ఉత్తరా నక్షత్రయుక్త మైత్రా ముహూర్తంలో శ్రీమహాలక్ష్మి ఒక స్వర్ణపద్మంలో అవతరించింది. ఆ సహస్ర పత్రకమలంనుండి వచ్చి శ్రీ వేంకటేశ్వరుని వక్షమందు అలంకరించెను. ఆ సరస్సును పద్మసరోవరంఅంటారు. తిరుచానూరు సమీపంలో నిప్పటికి అదికలదు. అచ్చటే శ్రీశుకుడు విష్ణుదర్శనం పొందెను. శ్రీ వేంకటేశ్వరుని వైభవం వర్ణనాతీతం అతడు దేవోత్తముడు ఈ కలియుగంలో అతడు ప్రత్యక్షదైవం. భక్తుల యభీష్టములను తీర్చువాడు. అందుకే:-

వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండేనాస్తికించన ।
వేంకటేశ నమోదేవో నభూతో న భవిష్యతి ॥

వేంకటాద్రి తీర్థములలో ఉత్తమతీర్థం, అనేకపత్ర పుష్పములు అక్కడ కలవు. అంచేత చింతామణి గిరియని దాని నందురు. అనేక కోరికలుతీర్చును. జ్ఞానాద్రియనికూడదాని నందురు. జ్ఞానమిచ్చును గనక విష్ణువాజ్ఞను ఆదిశేషు డురగరూపంపొంది ఆకొండవలె అయినాడు. అంచేత శేషాద్రియని దానికిపేరు.

"నారాణాంశ సంభూతః శేషోరగగిరిరూప ధృత్
తస్యోపరిప్ర భూతాయేతృణగుల్మలతాదయః
తేహిస్థావరరూపేణ వసన్తోయోగి పూరుషాః
బ్రహ్మరుద్రాది దేవేభ్యోయోగినామిత తేజసః ॥

ఈ భారత భూమిలో వేంకటాద్రి పుణ్యభూమి. మిక్కిలి పవిత్రమయినది. ప్రస్తుత నవనాగరికతా దోషం నుండిదాన్ని సర్వవిధముల ప్రభుత్వం కాపాడాలి. ఆ దేవునియర్చన భక్తితో పవిత్రముగా నిర్వహిస్తే అతని వైభవం యింతకంటె అధికంగా ప్రకాశిస్తుంది. అక్కడ ఏ ఏ భక్తులు యాత్రచేయుదురో "తీర్థీకుర్వన్తితీర్థాని" అని ఆ ప్రదేశం తీర్థంగాచేయుచు విష్ణుసేవాపరులై మోక్షమును పొందగలరు!

ఓంతత్సత్.

---

# భట్ట బాణుని అమరవాణి

మూలము : సంస్కృత కాదంబరి.

సేకరణ & అనువాదము :
డి. నాగసిద్ధారెడ్డి,
తిరుపతి.

1. పుణ్యాని భవంతి నామగ్రహణాన్యపి మహా మునీనామ్.
(మహామునులయొక్క నామోచ్చారణములు సైతము పుణ్యకరములు.)

2. ప్రాణ పరిత్యాగేనాఽపి రక్షణీయాః సుహృద సవః
(స్నేహితుని ప్రాణములు ప్రాణత్యాగముచేసి యైనను రక్షింపతగినవి.)

3. నహికించిన్న క్రియతే హ్రియా.
(సిగ్గుచేత చేయరాని కార్యమే లేదు.)

4. సర్వదా దుర్లభమ్ యౌవనమస్ఖలితమ్.
(ఎల్లప్పుడు యౌవనము చెడకుండుట దుర్లభము)

5. సుహృదా సుహృదసన్మార్గ ప్రవృత్తోయా వచ్ఛక్తితః సర్వాత్మనా నివారణీయ.
(స్నేహితులు చెడుమార్గమున నడచుచున్నప్పుడు వాని మిత్రులు వానిని తమ సర్వశక్తులనుపయోగించి తప్పుదారి నుండి నివారింపవలయును.)

6. సతత మతిగర్హితేనా కృత్యేనాఽపి పరి రక్షణీయాన్ మన్యంతేసుహృదసూన్ సాధవః
(నిందితమైనదైనను, చేయతగని దైనను సరే చేసి స్నేహితుల ప్రాణములను రక్షింపవలెనని గొప్పవారు తలచెదరు.)

7. అతిక్రాంతాన్యపి వా సంకీర్త్యమానాని అనుభవసమాంవేదనాం ఉపజనయంతి సుహృజ్జనస్యదుఃఖాని.
(చాలకాలము గడచినదైనను మరల స్మరించుటచేత గొప్పవారిదుఃఖములు పూర్వవేదనను తిరిగి కల్గించును.)

8. ఆశయా హి కిమివ నక్రియతే.
(ఆశచేత చేయతగని కార్యమేదియులేదు).

9. అచింత్యోహి మహాత్మానాం ప్రభావః
(మహాత్ముల ప్రభావములు ఊహాతీతములు గదా!)

10. అనేక విధాశ్చ కర్మణాం శక్తయః
(కర్మయొక్క ప్రభావమనేకవిధములైనది.)

11. ప్రభవతి హి భగవాన్ విధిః
(పూజ్యుడగు దేవుడు సామర్థ్యముగలవాడు.)

12. బలవతీ చ విధినియతి, ఆత్మేచ్ఛయా నశక్యముచ్ఛ్వసితుమపి,
(దైవనిర్ణయము బలమైనది. జనునకు తనయాభీష్టానుసారము ఊపిరి విడుచుటకును శక్తిచాలదు.)

13. నక్షమంతే దీర్ఘకాలమవ్యాజరమణీయంప్రేమ.
(అవ్యాజమనోహరమగు ప్రేమ దీర్ఘకాలము (వియోగమును) సహించియుండదు.)

14. ధీరా హి తరంత్యాపదామ్.
(ధీరులు ఆపదలను తరింతురు.)

15. దుఃఖిత మపి జనం రమయంతి సజ్జన సమాగమా.
(సజ్జనులతోడి కలయిక దుఃఖితులనుసైతము సంతోషింపజేయును.)

16. దుర్లభో హి దాక్షిణ్య పరవశో నిర్నిమిత్త మిత్ర మకృత్రిమహృదయో విదగ్ధజనః
(దయాపరుడు, నిష్కపటి, మోసము తెలియనివాడునగు అకారణమిత్రుడు దొరకుట దుర్లభము.)

17. బహు భాషిణో నశ్రద్ధధాతి లోకః.
(అతిగా మాటలాడువానిని లోకము విశ్వసింపదు.)

18. కిమి వహి దుష్కర మకరుణానామ్.
(నిర్దయులకు చేయరానిదేముండును? ఏమైనను చేయగలరని భావము.)

19. అతి కష్టాసు దశాస్వపి జీవిత నిరపేక్షన భవంతి ఖలు జగతి ప్రాణినాం ప్రవృత్తయః
(మిక్కిలి కష్టదశయందు గూడ ప్రపంచమున ప్రాణుల ప్రవర్తనలు జీవితాశలేనివికావు.)

20. నాస్తి జీవితాదన్యదభిమత తరమిహజగతి సర్వజంతూనామ్.
(ఈ లోకమున సమస్త జంతువులకును (ప్రాణులకును) ప్రాణముకంటె ప్రియతరమైనది మరియొకటి లేదు.)

21. ప్రాయేణా కారణమిత్రాణ్యతి కరుణార్ద్రాణి సతాంఖలు భవంతి సదా చేతాంసి.
(సాధారణముగ సత్పురుషుల చిత్తములు అకారణమిత్రములు, అతికరుణార్ద్రములునై యుండును.)

—

# సుప్రభాత – రత్నములు

— శ్రీ బి. అప్పారావు, ఖర్గపురం

— *** —

ఉ. చుక్కలు మికటిపై తరిగె సుందరులందరు లేచినారు "కో
కొక్కొరొకో" యనంగ నల కోళులు కీరము లెల్ల కూయగా
కొక్కెరలెల్ల వెల్లనగు కూటువు లేచును కూక లేయగా
చక్కగ పూజచేతురిక సాకఁగ లేవవే వేంకటేశ్వరా!

ఉ. శ్రీరఘురామచంద్ర! నరసింహామ! శ్రీకర! సారెసారెకున్
కోరిన కోర్కెకున్ శుభముఁ గూర్పఁగ దేవతలందరున్ మనో
పూరిత సంతసంబులను మూఁడు జగాలకు శాంతి గూర్పగన్
తోరఁపుఁ గోర్కెతో దివినిఁ దోచిరి లెమ్మిక వేంకటేశ్వరా!

ఉ వెల్గులఁ జిమ్మె యాకసము, వేదనగోల్పు తమిస్రమంతయున్
అల్గినకాంతయట్లలరి, అంతముఁ జెందెను భూనభంబునన్
వెల్గిన వెల్గులున్ మదిని వింతగు శోభను వెట్టిఁ జేయగా
కల్గిన కాంతులన్ ఫలము లందఁగ లేచిరి వేంకటేశ్వరా!

ఉ. ఆమధుకైటభాసురుల కాలముఁ దీర్చిన విష్ణుసాధ్వి! శ్రీ
స్వామిని! యాశ్రితాగతుల సాదర దృక్కులఁజూచుదేవి శ్రీ
కామిత కామినీ జనులు, కవ్వముఁ జిల్కఁగ కోడికూతతో
గోమున లేచినారు నినుఁగొల్వఁగ లేవవొ మంగమాంబరో

ఉ. పద్మదళాయతాక్షి! వృషపర్వతనాథు ననుంగు భార్య! యో
పద్మ! మహేశ్వరాది ప్రియభార్యలచే కొలువొందుమాతరో
పద్మదళాయతాక్షు నిలభక్తి భజింపఁగ వేచినారు. మీ
పద్మమువంటిపాదముల బాధల దీర్పవె మంగమాంబరో

ఉ. బ్రహ్మమహేశ్వరాది దివిపాలకులందరు నీ త్రివిక్రమ
బ్రహ్మముఁ జూడగోరి దివిప్రార్థనగీతము లెన్నిలక్షలో
బ్రహ్మముహూర్తమంద మితభక్తిని గానము చేయుచుండిరో
బ్రహ్మమ లెమ్ము లెమ్మికను ప్రాచిని భాస్కరకాంతులీనెడిన్

ఉ. కష్టములెన్ని యో గలిగె కాదనలేదయ కాలవాహినిన్
నష్టములెన్ని యో పడియు నాదన లేదయనాథు సొమ్ములన్
ఇష్టములెన్ని యోఁదొలఁగ యీర్ష్యయులేదయ యీ జగంబుపై
దుష్టులుఁ జేరవచ్చినను దూరము జేరను వేంకటేశ్వరా!

ఉ. మ్రొక్కెదరందరాపదల, మోదముచెందినవేళలందు నా
మ్రొక్కులు తీర్పశక్తిగల మ్రొక్కులో తీర్పగ శక్తి లేనివో
చక్కనెఱుంగ కుండగను, శక్తులడంగగ యేమిసేతు నిం
కక్కట యంచు నుల్లమున - యారటఁబొందరె వేంకటేశ్వరా।

ఉ॥ కశ్యపమౌని సప్తకము కల్యనులేచియు సంధ్యవార్చి యా
కాశపు గంగ యందలివి కాంచన పద్మము లేరితెచ్చి యే
యాశలు లేక పాదములు హాయిగ పూజలు చేయవచ్చిరో
శ్రీశ మహానుభావ యిల శ్రీలనొసంగగ లెమ్ము లెమ్మికన్—

———

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము తిరుమల

## ఆర్జితము – షెడ్యూలు

### 1. దర్శనములు

| | | |
|---|---|---|
| 1. | స్పెషల్ దర్శనము | రు. 25 |
| 2. | తోమాలసేవానంతర దర్శనం | రు. 4 |
| 3. | అర్చన సేవానంతర దర్శనం (సహస్ర నామం లేక అష్టోత్తరం) | రు. 3 |
| 4. | ఏకాంతరసేవానంతర దర్శనం | రు. 4 |
| 5. | పూలంగిసేవానంతర దర్శనము | రు. 2 |
| 6. | అభిషేక సేవానంతర దర్శనము | రు. 3 |

### 2. సేవలు

| | | |
|---|---|---|
| 1. | అమంత్రణోత్సవము | రు. 130 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5. | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 107 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2000 |
| 9. | తిరుప్పావడ | రు. 4000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |

### 3. ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2000 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము (1–వ తరగతి) | రు. 1500 |
| 4, | ,, (2–వ తరగతి) | రు. 750 |

### 4. వాహనములు

| | | |
|---|---|---|
| 1. | సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72+1 (హారతి) | రు. 73 |
| 2. | బంగారు గరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62+1 (హారతి) | రు. 63 |
| 3. | వెండిగరుడి, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32+1 (హారతి) | రు. 33 |

### 5. అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1. | దధ్యోదనము | రు. 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 60 |
| 5. | సాకరబాత్ | రు. 85 |
| 6. | కేసరిభాత్ | రు. 90 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### 6. పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోలి | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### 7. నిత్యసేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 2. | నిత్య అర్చన | రు. 42 |

# శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు
# దేవస్థానము సేవ




శ్రీ పి. యస్. రాజగోపాలరాజు బి.ఏ.,బి.యల్.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు తిరుపతి.




ఆంధ్ర సారస్వత చరిత్రలో తాళ్ళపాక వారి పేరు అజరామరమైనది. వారిలో సంకీర్తనాచార్యుడు అన్నమయ్య ఆద్యుడు. ఇతడు హరి అవతారమని ప్రతీతి. కర్ణాటక సంగీత పితామహుడు పురందరదాసు మధురకవితా పితామహుడైన అన్నమయ్యను దర్శించి సంకీర్తనలు విని ముగ్ధుడై శ్రీ వేంకటేశ్వరుని అవతారముని ప్రశంసించెను. శ్రీ వేంకటేశ్వరుని వరప్రసాదముతో వరకవిత్వ వాణీవీణా నాదమును పరిశీలించిన తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య. ఈతడు పరమపవిత్రములైన ముప్పదిరెండు వేల యోగ వైరాగ్య శృంగారసంకీర్తనలను రచించెను. అదొక సారస్వత క్షీరసముద్రము. కాలగతిలో అందలిగాన గంధ మంతరించినను సాహితీసుగంధము మాత్రము రాగిరేకుల కెక్కుట వలన మనకు దక్కినది. ఈ పుణ్యము కూడ సంకీర్తనాచార్యుని కుమారుడైన తిరుమలయ్యదే. అన్నమయ్య పాటలువిని శ్రీనివాసుడు అన్యవాగ్విరక్తుడైనాడట. హరి ముకుందుని గొనియాడునాదు జిహ్వ అన్యుల నుతింపనేరదని, నిష్కల్మష, విష్ణుభక్తి తత్పరుడై జీవించిన పరమ భాగవతుడీతడు. శ్రీరామానుజ సిద్ధాంత సారస్వతమును ఆంధ్రమున వ్యాప్తికి దెచ్చిన పంచమాగమ సార్వభౌముడు. అన్నమాచార్యుడు తన జీవితమును శేషగిరీశుని శ్రీ పాదముల కంకితము చేసెను. ఆ స్వామినే నిత్యము భావించి పూజించెను. ప్రేమించి, కలహించి, లాలించెను. పొగడి, తెగడి ఆనందించెను. విష్ణుభక్తి భావముతో అణువణువున

స్మరించి పరవశించెను. అనంత భావనా తరంగము లలో రసికులను సహృదయులను తాండవ మాడించెను. ఆ జగన్మోహనమూర్తిని, మానసికముగా కాయికముగానే గాక, వాచికముగా కూడ అనుభవించెను. ఆ వాచకానుభవములే అన్నమయ్యపదరచనములు. దివ్యమంగళ స్వరూపుని గళసీమ నలంకరించినవి. అలుమేలు మంగ అలకుల కులుకుల, కురిసినవి. ఆతని శృంగారపదములు మధుర భక్తి భావ సమ్మిళితములు. అవి శ్రీ వేంకట శైల వల్లభుని దివ్యశృంగారలీలలై ఆధ్యాత్మిక శిఖరములనే యందుకొన్నవి.

రక్తి విరక్తిగా పరిణమించినది. అన్నముని హృదయము రసపరిణతిని చెందినది. ఆతని ఆధ్యాత్మిక సంకీర్తనలు శ్రుతిస్మృతి పురాణముల మేళవింపుతో గుబాళించినవి. అన్నమయ్య ఆడినదెల్ల అమృతమయ కావ్యమైనది. పాడినదెల్ల పరమ గానమై విలసిల్లినది. అమిత ప్రయాసలకోర్చి అన్నమయ్య సారస్వత నిక్షేపములైన రాగిరేకులను సంపాదించి పరిష్కరించి, చాల మటుకు ముద్రించితిమి. ఈ పరిష్కరణ కార్యక్రమమును శ్రీయుతులు సాధు సుబ్రహ్మణ్యము, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ,కీ. శ. వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైన సుప్రసిద్ధ విద్వాంసు లెందరో నిర్వహించిరి. ఆ పరిష్కరణ కార్యక్రమ మింకనూ కొనసాగుచునే యున్నది. ప్రతి సంవత్సరము మేము నిర్వహించు అన్నమాచార్య వర్ధంతి ఉత్సవములందు పలువురు ప్రముఖ సంగీత సాహిత్య వేత్తలు పాల్గొనుచున్నారు. ఒక మహా భక్తునకు మహా వాగ్గేయ కారునకు స్మృతిచిహ్నముగ నిలిచినదే అన్నమాచార్య కళామందిరము.

క్షేత్రయ్య, త్యాగయ్యలకే శృంగార వైరాగ్యములను పంచిపెట్టిన ఈ మహాతపస్వి జీవిత మెందరో కవిగాయక, నికరములకు వెలుగు రేఖలను ప్రసాదించుగాక.

---

అన్నమాచార్య కళామందిర ఉద్ఘాటనోత్సవ సందర్భమున చేసిన స్వాగతోపన్యాస సారాంశము.

పదకవితా పితామహుడు

# శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు

— శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ
శ్రీ అన్నమాచార్య సంకీర్తనముల పరిశోధకులు.

పుట్టుట గిట్టుట మొదలగువి మనుష్యులందరకు సహజములే, సమానములే. కాని, కొందరికి మాత్రము జయంతివర్ధంత్యుత్సవములు నేలనాలుగు చెరగుల స్వపరభేదము లేకుండ ప్రజలందరు సాగింతురు. కొందరికి తమయిండ్లలో గూడ జరుగవు. అట్లుత్సవములు దేశప్రజలచే చేయించుకొనుమహాపురుషులు తమజీవితకాలములో తనకని కాక లోకక్షేమమునకై గట్టి వ్యవసాయము నడపి, దాని ఫలితమును తన మన లేక యందరకు పంచిపెట్టినధన్యజీవులు. వారి భౌతికకాయము ఎన్నియీతిబాధలకు గురియయ్యెనో మన మెరుగము. కానీ శాశ్వతమగు వారికృషిఫలితమును తేనెవలె దోసిళ్ళతో జుఱ్ఱినమనము యథాశక్తి వారియశశ్శరీరము నారాధించి మనకు మనము చరితార్థులమని తృప్తిపడుచుందుము. "నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్" "తే హి కారణజన్మానః" మొదలగు వచనము లిట్టిపుణ్యపురుషుల నుద్దేశించినవే. వీరిలో కొందరు రాజకీయముగను కొందరు కళారంగమునను పాటుపడి దేశప్రజలహృదయముల నాకర్షించుకొనిరి.

## 1. అన్నమయ్య జన్మాదికము

అట్టివారిలో, సంగీత-సాహిత్య కళలతో దేశసేవ భగవత్సేవయు చేసి, తాను తరించి తరువాతి వారిని తరింపజేసిన పుణ్యమూర్తి అన్నమయ్య. ఈయన, క్రీ. శ. 1424 క్రోధిసంవత్సర-వైశాఖశుద్ధపూర్ణిమనాడు విశాఖా నక్షత్రమందు నారాయణసూరి లక్కమాంబలజన్మము సఫలమగునట్లు పుట్టిన పవిత్రమూర్తి. ఈతని జన్మస్థలము కడపజిల్లా రాజంపేట తాలూకాలోని 'తాళ్ళపాక'యను చిన్నగ్రామము. ఈ ప్రదేశ మంతయు ఆనాటివ్యవహారముప్రకారము పొత్తపినాడు లోనిది. నారాయణసూరికి చాలకాలము సంతానము కలుగకుండుటచే ఆదంపతులు మనవేంకటేశ్వరునకు మ్రొక్కుబడి చేసిరట. ఆనాటిరాత్రి వారికి కలలో స్వామికాలియందెలు, శ్రీస్వామివారికటారు (కత్తి) దర్శన మిచ్చినవట. ఆ ప్రసాదమే అన్నమయ్య, శ్రీస్వామివారిచిరుగజ్జెల ప్రభావమే, అన్నమయ్య సంగీత-సాహిత్యకళారాశి యగుటకు కారణము కావచ్చు. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అనుశ్రుతి ప్రకారము అన్నము పరబ్రహ్మస్వరూపము గాన, నారాయణసూరి వీరికి పరబ్రహ్మ వాచకముగ అన్నమయ్య అని నామకరణము చేసినారు. పన్నిద్దరాళ్వార్లలో నొకరగు పేయాళ్వారువలె అన్నమయ్యయు స్వామినందకాంశ మని ప్రసిద్ధికలదు. నారాయణసూరి కలలో స్వామివారికటారు దర్శనమిచ్చినఫలిత మిదియే కావచ్చు.

అన్నమయ్య అడ్డాలబిడ్డడై యున్న నాళ్లలోనే "తిరుమలప్ప ప్రసాదము" అని చెప్పకుంటే ఉగ్గు కూడా త్రాగడట. కొంచె మెదిగి ఐదేండ్లవా-

డయినా డన్నమయ్య. శంకరాచార్యులకు వలె ఈతనికి తండ్రి యైదవయేటనే ఉపనయనము చేయించినారు. "నవమే త్వాయుష్కామం పంచమే బ్రహ్మవర్చసకామమ్" అనుస్మృతివచనము ననుసరించి తనకొడుకు బ్రహ్మవర్చస్వి కాగలడని నారాయణసూరి అట్లు చేసియుండును. ఉపనయనమై గురువునొద్ద విద్యాభ్యాసమునకు చేర్చిరి. అది వట్టిశాస్త్ర మర్యాదగనే నడచినది. "ప్రవేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అన్నట్లు అన్నమయ్య కన్నివిద్యలు తమకు తామేవచ్చి నాలుకకొన నాట్య మాడినవి. విద్యాభ్యాసకాలముననే కవితావనిత వీరికౌగిటి కొదిగి నట్లున్నది. ఆనాటి నుండియే అన్నమయ్య సంకీర్తనములు పాడి ఆడుచుండెడి వాడట. ఆయన ఆడిన దాట పాడి నది పాటగ లోకులు మెచ్చి కీర్తించు చుండిరట. భగవచ్ఛక్తికి మించినవస్తువు లేదను ఆస్తికులందరు ఈ విషయములందు వింతపడరు.

రానురాను అన్నమయ్యకు స్వామిపై మరులు బలిసి యింటివారికి చెప్పక ఒంటరిగ తిరుమలకు పయనమై తనయూరినుండి కాలినడకతో దిగువ తిరుపతి చేరి, గ్రామ దేవతయగు తాళ్ళపాక గంగమ్మకు నమస్కరించి, ఆనాటివేకువన కొండకు పయనమై, అలిపిరియొద్ద నున్న చింతచెట్టుకు, ఆదాపల నున్న నృసింహస్వామికిని సేవచేసి జాముప్రొద్దెక్కునంతకు మోకాళ్లమెట్టు చేరి, అప్పటికి గలిగినబడలికతో సొమ్మసిలి నేల వ్రాలిపోయెనట. జగన్మాతయగు అలమేలుమంగ ఆ మైకములో నున్నవానిని లేపి తనకడగంటి చూపులతోడనే ఆతనిబడలికలు దీర్చి, నాయనా! యీ కొండ సాలగ్రామమయము, దీనిని చెప్పుకాళ్ళతో నెక్కరాదని చెప్పెనట. ఆయూరడింపునకు తనిసి అన్నమయ్య జగన్మాతపై ఆశుధారతో నొక శతకము చెప్పినాడట. ఆపై చెప్పులు వదలి యెక్కి మెల్లన కొండ చేరి, ఆ రాత్రి నివసించి మరునాడు వేకువన కోనేటిలో స్నానము చేసి పండ్రెండు నామములు ధరియించి దేవళమునకు పోగా, గుడితాళము వేసియుండిరట. అన్నమయ్య స్వామిని శతకముతో కీర్తింపగనే తాళములు తమకు తామే వీడెనట. వైఖానసు లీతనిమహిమ గుర్తించి స్వామిదర్శనము చేయించి దేవునిప్రసాదమిచ్చి గౌరవించినారట. ఇట్లు స్వామి నాతడెన్ని దినములు సేవించెనో తెలియదు కానీ, ఒకనాడు విష్ణునామధేయుడైన యతికి స్వామికలలో ప్రత్యక్షమై నావాడొకడు రేపు నీకడకు వచ్చును; అతనికి నీవు చక్రాంకనముచేసి, పంచ సంస్కారములతో వైష్ణవదీక్ష నిప్పింపు మని చెప్పెనట. ఆతడు వెరగంది లేచి ఉదయముననే తననిత్యకృత్యములు తీర్చుకొని శంఖచక్రముద్రలు చేతనూని అన్నమయ్యకై అఱ్ఱులు సాచి చూచుచుండెనట. ఇంతలోస్వామికలలో చెప్పినగుర్తులతో అన్నమయ్య ఆయతిముంగిలి చేరగనే ఆతడతనికి చక్రాంకనాది పంచసంస్కారములు చేసి వైష్ణవదీక్ష యిచ్చెనట. నాటినుండి అన్నమయ్య అన్నమాచార్యులైరి. ఆపై గురువుగారి ఆనతితో ఊరికి పోయి పెద్దలమాటమేరకు తిరుమలక్క (తిమ్మక్క) అక్కలమ్మల నొకేసారి వివాహమై, వారితో బాటు అహోబిలమునకుపోయి శఠకోపయతిచే శ్రీవైష్ణవ సిద్ధాన్తమగు విశిష్టాద్వైతమును సమగ్రముగ నభ్యసించి, తనజీవిత మంతయు ఆమతప్రచారమునకే అంకితము చేసినాడు. పుట్టుకతో నీతడు నందవరీకస్మార్తబ్రాహ్మణశాఖకు చెందినవాడు. ఈ నందవరీకు లందరును ఋగ్వే-

దులు; ఆశ్వలాయన సూత్రులు. ఈ తాళ్ళపాక వారిది భారద్వాజ గోత్రము. ఈ తాళ్ళపాక వారిలో అన్యగోత్రములవా రున్నట్లు తెలియుచున్నది. ఈతని తరమునుండి యీ కుటుంబము వారుమాత్రము వైష్ణవులైనట్లు కానవచ్చుచున్నది. అన్నమాచార్యుల కెప్పు డెక్కడ ఎట్లు స్వామి ప్రత్యక్షమయ్యెనో చెప్పలేము. కానీ, రాగిరేకు లందంతట "తన పదనాఅవ యేట స్వామి ప్రత్యక్షమైతేను" అని కలదు. ఇది సత్యమనక తప్పదు.

## 2. అన్నమాచార్యుల సారస్వతము

చాటుమాటున శాసనములం దున్న పద్యబంధఫక్కిని సంతరించి, 11. వ, శతాబ్దమున భారతమునకు శ్రీకారము చుట్టి నన్నయ్య, పద్యప్రబంధ రాశి కంతటికి మూలపురుషుడుగ తెనుగున కాది కవిగ వెలసినాడు. ఈతనిది తత్సమపదబహుళమగు కవిత్వము. తరువాతివాడగు తిక్కన, "కొన్ని రసములకు మేము చాలమేమో" యని వెనుక కొదిగియున్న తెనుగుపదముల జలుకు తీర్చి సర్వరస భావములందును ఆ తెలుగుపదములకు స్వాతంత్ర్య మిచ్చి వాడిరసస్ఫూర్తిని, చెవికింపును గూర్చి దేశికవితకు మూలపురుషుడై తెనుగున రెండవ కవిగ మన్నన కెక్కినాడు.

పండితులమన్నన లేమిచే ఒకమూల తలవంచుకొని యుండిన పదకవిత్వమును చేపట్టి, 'మనము గ్రామ్యము లైతిమే'యని దూరదూరముగ తొలగి యుండిన వ్యావహారిక పదములకు జంకుగొంకులు దీర్చి భుజముదట్టి చేయివేసి చేరదీసి వాటిని యథేచ్ఛముగ వాడి, అటు పదకవిత్వమున కొక సింహాసనమును, వ్యావహారిక పదములకు ప్రయోగయోగ్యతను, రససిద్ధిని, 15 వ శతాబ్దమున చేకూర్చిన అన్నమాచార్యులు, పదకవితాపితామహులు-సంకీర్తనాచార్యులై పై నన్నయ తిక్కనలవలె లోకమునకు పూజనీయులైరి. నన్నయ మొదలు నేటి దాకగలతెలుగు కవులలో ఇంత పెద్దవాఙ్మయమును సృష్టించినఘను డింకొక్కడు లేడు. ఈతడు కేవలము పాటలను మాత్రమే వ్రాసినాడను వారును లేకపోలేదు. కానీ, యీతని కవిత్వము సంస్కృతాంధ్రప్రాకృతములందు అడ్డమాకలు లేక సాగినది. ఈతని కావ్యరాశినిగూర్చి యీతని మనుమడు చిన్నన్న:—

[1] యోగమార్గంబున నొకకొన్ని, బుధులు
వైరాగ్యరచనతో వాసింపఁ గొన్ని,
రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని
సారసనేత్రుపై సంకీర్తనములు
సరసత్వమునఁ దాళసముఖముల్ గాఁగ
పరమతంత్రములు ముప్పదిరెండు వేలు,
ప్రవిమలద్విపదప్రబంధరూపమున
నవముగా రామాయణము, దివ్యభాషనా వేంకటాద్రి మాహాత్మ్య మంతయును,
గావించి, రుచుల శృంగార మంజరియు,
శతకముల్ పదిరెండు, సకల భాషలను
ప్రతిలేనినానాప్రబంధముల్ చేసి-

అని వాకొనియున్నాడు. ఇవిగాక సంస్కృతమున అన్నమాచార్యులు రచించిన సంకీర్తన లక్షు

1. పై ద్విపదలోని మొదట నాల్గు చరణములు ప్రాసరహితము లున్నవి. 1, 3 పదము లొకటిగ, 2, 4 పదము లొకటిగ చేసిన ఆ దోషము తీరును.

ణము గలదట. సంకీర్తనములలో సగమునకు తక్కువగ, శృంగారమంజరి మాత్రము మనకు రేకులలో లభించుచున్నవి. ఇట్లుగ్రంథరాశిని బండ్లకెత్తించిన యీ మహనీయుని సారస్వతశక్తి, స్వామిపై గల తిరుగుమరుగు లేని భక్తి, జోడుచేడేల సంసారి యయ్యును సంసారమును రోసిన యితనివిరక్తియు మనబోటివారికి దురూహములు.

అరవభాషలో పంద్రెండుమంది ఆళ్వారులు (వైష్ణవభక్తులు) కృ24 ప్రబంధములుగ రచించిన పాశురములు 4000 మాత్రమే. దీనినే ద్రావిడాగమ మని, దివ్యప్రబంధమని వ్యవహరిస్తారు. అట్లే అరవై ముగ్గురు నాయనార్ల (శైవభక్తుల)లో నలుగురు మాత్రము రచించినవి దాదాపు 7000 వేలు. దానినే తేవారమని వ్యవహరిస్తారు. ఈ రెండింటికి దీటుగ తెలుగువారికొదువ దీర నన్నమాచార్యు లొక్కరే ముప్పది రెండువేల కీర్తనలను చతుర్వేద సారముగ, పంచమాగముగ, రచించిరి. ఈతనికృతులతో వేదార్థములు, వేదాంతములు, పురాణగాథలు, శృంగారాది రసములు, తత్వము, భక్తి, పలుకుబళ్ళలో జాతీయత, సందర్భోచితములైన లోకోక్తులు, వ్యంగమర్యాదలు, అలంకారములు ఓహో ఒక్కటేమిటి సాహిత్యసర్వస్వము తనకుతానే నిండి పండి పరిమళించుచు శ్రీవేంకటేశ్వర మహిమలు ఊటలుబియు చుండును. ఈతనికృతులన్నియు భాష యేదైనా, గ్రంథ మేజాతిదైనా, తానేదైవమును పేర్కొన్నా అదంతా శ్రీ వేంకటేశ్వరునికి జోడించి శ్రీస్వామివారికే సమర్పించుకొన్నారు. ఈతనిరచనలో కానవచ్చు మర్మ మొకటి కలదు. మాటలు తేటగ నుండుట, భావము లోతైయుండుట, దానివలన సాహిత్యమున సాధారణమైన పరిచయము గలవారు పైపై తేటను గ్రహించి మురియుచుందురు. మర్మజ్ఞు లగువారు లోతు లాలోచించి తనియుదురు.

పదకవిత్వమునకు అన్నమాచార్యులు ముల్లు కల్లు లేనిచక్కనిబాట వేసిరి. తన యనంతరము వారగు క్షేత్రయ్య, త్యాగరాజు, సారంగపాణి ప్రభృతులు ఆ బాటలో పొడవునా పెద్దపెద్ద చెట్లు పెంచి నిలుచు నీడలు నిండించిరి. పైపై నడచు బాటసారులందరు నీడకు మురిసి బాటను మరచిరి. అది నేటిసంగీతవిద్వాంసులవలన అన్నమాచార్యుల కబ్బినసత్కారము. పురందరదాసను సుప్రసిద్ధ కన్నడ వాగ్గేయకారకుడును అన్నమాచార్యులకు శిష్యప్రాయుడే. త్యాగయ్య మొదలగువారికీర్తనలలోసంగీతమునకు ప్రాధాన్యము; సాహిత్యమున కుండీ లేనట్లు రెండవస్థానము. అన్నమాచార్యులకీర్తనలలో సంగీత సాహిత్యములు రెండును సమప్రధానముగ పందెములు వేసికొని పరుగులెత్తినట్లుండును. ఈ పద్ధతి క్షేత్రయ్యయందును కొంత కనబడుచుండును. ఏమైన నేమి సంగీతసాహిత్యవిద్వాంసుల కొకేబంతిలో వడ్డన చేసినధర్మకర్త అన్నమాచార్యు లొక్కరే. కేవల సంగీతజ్ఞులకు కొరుకుడువడని మధురభక్ష్యములు కొన్ని సాహిత్యజ్ఞులకే వడ్డించిన పక్షపాతమూ కానవచ్చును. వీరితెలుగు, గ్రాంధికము లైన రూపములకు దగ్గరగనున్న వ్యావహారిక పదములకు అరసున్నలు శకటరేఫలు జోడించినదే యెక్కువభాగము.

ఈతని కవిత్వమంతా అనుభవించి జీర్ణించుకొన్నట్లు మనసంటినమాటగా నుండునే కాని, పెదవిపై మాటవలె తేలికగ కానరాదు. ఈతని-

తరువాతికవులు చాలమంది యీతనికవిత్వము-లోని పలుకుల బళ్ళను యథేచ్ఛముగ వాడి ప్రసిద్ధి పొందిరి. కాని యితనిపేరు స్మరింపరైరి. ఎక్కువ-భాగ మితనిది పదసాహిత్యము కావున ఆపని జరిగియుండునేమో! ఎంత పాండిత్య మున్నను, ఎంతభక్తి యున్నను, ఒక్క శ్రీ వేంకటేశ్వరునిపై ఇన్ని భావ పరంపరల నూహించు రాసిక్య మితనికి దక్క వేరొక్కనికి లేదన్న అతిశయోక్తి కాజాలదు. ఇప్పటి కెప్పుడో ఎంతో ప్రచార ప్రసిద్ధుల-నందవలసినఈ సాహిత్యము ఇప్పటికింకా ప్రచార-ప్రారంభదశలో నుండుట ఆంధ్రసాహిత్యరసికుల-దురదృష్టమనక తప్పదు. వీరి రచనలతో నిండిన-రాగిరేకులు శతాబ్దములతరబడి అజ్ఞాతవాసము చేయుటయే దీనికి కారణము కావచ్చు.

## 3. అన్నమాచార్య సాహిత్యము - దేవస్థానము వారి సేవ

1922-23 సం॥లలో శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారి జోక్యముతో ఆ రేకులు తాళ్ళపాక వారి అర విడిచి బైటికడుగు బెట్టినవి. నాటినుండి నేటి దాక నిదానముగ, వేగముగ ఎందరెందరిచేతుల మీదనో యీపని సాగుచున్నది. ఇంకా ఈ యోడ దరి చేరలేరు. 1947 నుండి శ్రీ చెలికాని అన్నారావుగారి యాజమాన్యము క్రింద కీ॥ శే॥ ప్రభాకర శాస్త్రిగారి పరిష్కరణముతో రెండేసంపుటములు ప్రకటింపబడినవి. ఈరచనల ప్రకటనకై యెన్నో-కలలుగన్న శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నింతలో కాలపురుషుడు కబళించినాడు. శ్రీ శాస్త్రిగారున్నపుడే యీపరిష్కరణకు సరియైన అధికారి శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారని శ్రీ శాస్త్రిగారిమూలముననే తెలిసిన శ్రీ చెలికాని వారు వారినిపిలిపించి యీపనికి తాంబూలమిచ్చిరి, వారూ మధ్య మధ్య నిలుచుచు సాగుచు దాదాపు 13. వ. సంపుటము వరకు ప్రకటించిరి. నడుమ ప. వి. శ్రీనివాసాచార్యులును స్వతంత్రముగ నాలుగు సంపుటములు వెలికితీసిరి. తాముఉద్యోగవిరమణము చేయుచున్నపుడుగూడ శ్రీచెలికాని వారు, ఈ పని నిలువ గూడదని యీ పరిష్కరణభార మంతయు శ్రీ పి. టి. జగన్నాథరావు గారి కప్పగించిరి. ఆ పరిష్కరణము ఒక సంపుటమును ప్రకటించి, మూడుసంపుటములకు ప్రెస్‌కాపీ తయారుచేసి నడుమ నెందుకో విశ్రమించినది. మరల శ్రీ బి. నరసింగరావు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారి కాలమున శ్రీమాన్ రాళ్ళపల్లి వారూ, వారు వృద్ధులగుటచే వారికి సహాయకుడుగ నేనూ, కలసి 2 సంపుటములు వెలికి దెచ్చి, మూడవసంపుటములో చాల భాగము ప్రెస్సుకు సిద్ధపరచితిమి. ఇంతలో మరల విఘ్నము. పది సంవత్సరములకు తరువాత మరల నిపుడు కమిటీ చేర్మెన్ శ్రీ చెలికాని అన్నారావు గారు, ఎగ్జిక్యూటివ్ అఫీసర్ శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజుగార్ల ఉత్తర్వుతో నీపని నేనుసాగించుచున్నాను.

ఈ రేకులన్నిటిలో శ్రీ అన్నమాచార్యులవి మాత్రము అధ్యాత్మశృంగార సంకీర్తనల రేకులు 2284. వీనిలోఅధ్యాత్మము 363 పూర్తిగ, శృంగారము 700, వెరసి 1063 రేకులు ప్రకటింప బడినవి. శృంగారములో ఎనిమిదవవంద ముద్రణకు పోబోవుచున్నది. 9-వ వంద వ్రాతలో నున్నది. పె. తి. అధ్యాత్మ శృంగారముల రేకులు 165 లో ఒక సంపుటము పూర్తియై, రెండవ సంపుటము అచ్చుకు కాచుకొనియున్నది. చి. తి. అధ్యాత్మ శృంగారములు 30 రేకులూ ప్రకటితము లైనవి.

కాగా, అన్నమయ్య శృంగారము రేకులలో అచ్చుకు సిద్ధముగానున్న 8. వ వందగాక, 12వందల రేకులు వెలికిరావలసి యున్నవి. ఈ పని యిప్పటి, క్రమముతో సాగిన 4, 5 ఎండ్లలో పూర్తిగ తాళ్ళపాక వారి రేకు లన్నియు ప్రకటితము లైనట్లు కాగలదు. ఈకీర్తనల రేకులే గాక చిల్లర-విషయముల రేకులన్నీ 1935 వ సంవత్సరముననే శ్రీ రావూ బహదూర్ కె. సీతా రామిరెడ్డి, కమీషనర్ గారి కాలముననే పూర్తిగ ప్రకటింప బడినవి.

తి. తి. దేవస్థానమువారి కృషికి లోపములేదు. పండితులకూ కొదువలేదు; కానీముప్పై యేండ్లుగ సాగుచున్నను ఈ పని పూర్తికాలేదు. అది అన్నమయ్య అదృష్టమంతే. "శ్రేయాంసి బహు-విఘ్నాని" అనునది అనుభవసిద్ధమైన మాటగదా! ఈ రచనలపై అందరు చేయి వేయలేరు. వేసిన వారును ఆత్రముగ పనిచేస్తే అన్నమయ్యకు, దేవస్థానమువారికీ, సాహిత్యమునకు ద్రోహము చేయుటేగాక, లోకాపవాదమునకును గురి గావలసి వచ్చును. వ్రాసిన ప్రతి సంపుటము అదేవనిగ ముద్రిస్తే గూడ దాదాపు మూడు మాసములు అవును. నడుమ నడుమ వ్రెస్సువారికి ఇతరపనులు పడితే చెప్పపనిలేదు. యథాశక్తిగ యథావకాశ-ముగ, ఈ పని పూర్తిచేయ వలయునను పూనిక కలదు. శ్రీనివాసునిదయ, అన్నమయ్య అనుగ్రహము సంపూర్ణముగ సహకరింపవలెను.

ఇంత వాఙ్మయమును సృష్టించి, స్వామిని మెప్పించి తాను ముక్తుడై, మనలను కృతార్థులు గండని రాగిరేకులపై తనవాఙ్మయమును ప్రసా-దించి పోయిన అన్నమయ్యకు మనము మనభక్తి-చిహ్నముగ సమర్పించుకొను చిరుకానుక యే నేటి యీ కళామందిరోద్ఘాటనము. దేవస్థానము వారు ధన్యులు. ఈ కార్యమున పాలుపంచుకొన్న ప్రతివ్యక్తి పుణ్యశాలి. సంగీత సాహిత్య రసికులకు, వాటి నాదరించు అధికారులకు మంగళమగుగాక.

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాకయన్నయవచోనూత్నక్రియల్ చెన్నగున్"
చి. తి. సంకీర్త – ల – 12

"వేదంబులు పౌరాణిక వాదంబులు వరకవిత్వ వాణీవీణా
నాదంబులు కృతసుజనాహ్లాదంబులు తాళ్ళపాకయన్నయ
పదముల్"
చి. తి. సంకీర్త – ల – 6

శ్రీ వేంకటాచలాధీశాధీనమానసయోగినే
తాళ్ళపాకాన్వయాంభోధిశశినేఽన్నాయ మంగళమ్
చతుశ్శీకృత గీర్వాణ ప్రాకృతాంధ్రవచోఽర్థియే
పదసాహిత్యకమల భాస్కరాయాస్తు మంగళమ్.

మంగళ మీ భవనమునకు మంగళమన్నార్య సభ్యమంత్రి
వరులతున్।

మంగళము వేంకటేశ్వరు సంగతి నధికారులైన సరసుల
కెల్ల

1. అన్నమాచార్యుల బాల్యాది చరిత్రమంతయు చిన్నన్న వ్రాసిన "అన్నమాచార్య" యను ద్విపద కావ్యమునుండి గ్రహింపబడినది.

27–12–74 తిరుపతిలో జరిగిన అన్నమాచార్య కళామందిరోద్ఘాటనోత్సవమందలి ప్రసంగ పూర్తిపాఠము

శ్రీ నీలకంఠ దీక్షిత ప్రణీతమగు

# సభారంజన శతకము



అనువాదం:
శ్రీమాన్ చలమచర్ల వేంకటశేషాచార్యులు
తిరుపతి

(గత సంచిక తరువాయి)

కః ప్రసూతే పురోవాతం కః ప్రేరయతి వారిదమ్ ।
ప్రాప్తే తు శ్రావణే మాసి భవ త్యేకార్ణవం జగత్ ॥ 63 ॥

తూరుపుగాలిని పుట్టించిన దెవరు? మేఘాల్ని ప్రేరేపించే దెవరు? శ్రావణమాసం వచ్చేసరికి భూమి జలమయమై సముద్రంలా కనిపిస్తుందంటే అది అంతా కాలం (ఋతు) స్వభావం.

కాలః కరోతి కార్యాణి కాల ఏవ నిహంతి చ ।
కరోమీతి విహన్మీతి మూర్ఖో ముహ్యతి కేవలమ్ ॥ 64 ॥

కాలమే కార్యాల్ని చక్కబెడుతుంది. కాలమే వాటిని పాడు చేస్తుంది కూడా. అది తెలియని మూర్ఖుడు తానొక పని నిర్వహించాననీ, తానీ పని చెడగొట్టాననీ భ్రమపడతాడు.

అపి కాలస్య యః కాలః సోఽపి కాల మపేక్షతే ।
కర్తుం జగంతి హంతుం వా కాల స్తేన జగత్ప్రభుః ॥ 65 ॥

'కాల' శబ్దానికి సమయము, యముడు అని రెండు అర్థాలు. కాలానికి కాలుడు (నాశం కలిగించే వాడు యముడు) శివుడు. అందుకే ఆయనకు 'కాల కాలుడు' అనిపేరు. కాలాన్ని ఉపసంహరింప గలిగే ఆయన కూడా ప్రపంచాన్ని సృష్టించటానికీ, సంహరించటానికీ ఒకకాలం (అదను) కోసం ఎదురు చూస్తాడు కదా! అంటే కాలమే లోకాని కంతకూ ప్రభువని చెప్పాలి.

కాలః సదాగతి రపి స్థాయీవ పరిచేష్టతే ।
చండమారుతవ ద్విశ్వ మధరోత్తరయన్ క్షణాత్ ॥ 66 ॥

కాలం ఆగేది కాకపోయినా, పెనుగాలి ప్రపంచాన్ని క్షణంలో తల్లక్రిందులు చేసినట్లుగా, లోకాల్ని తారుమారుచేస్తూ తాను మాత్రం స్థిరమైనట్లుగా ప్రవర్తిస్తుంది.

కాల శ్చాలయతి ప్రాయః పండితాన్ పామరా నపి ।
తం చే చ్చికీర్షతి వశే తితిక్షైవ మహౌషధమ్ ॥ 67 ॥

కాలానికి పండితులు–పామరులనే భేదం లేదు. అందరినీ అది కదలించివేస్తుంది. దాన్ని వశంలో పెట్టుకోవాలనుకొంటే సహనమే గొప్ప మందు.

రంధ్రేషు ప్రహరిష్యంతః కతి కామాదయోఽరయః ।
క్షణా న్నశ్యతి లోకోఽయం క్షమా చేన్న నియచ్ఛతి ॥ 68 ॥

పండితుణ్ణీ పామరుణ్ణీ కూడా వారి వారి దౌర్బల్యాల్నిబట్టి దెబ్బతీసే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులనే అంతఃశత్రువులు ప్రతి ఒక్కరిలోనూ ఉన్నాయే, ఓర్పంటూ వాటిని అదుపులో పెట్టకపోతే యీ లోకం క్షణంలో నాశనమయ్యేది కాదూ!

అపకార పరాణా మ ప్యుపకుర్వంతి సాధవః ।
ఛిందంతమపి వృక్షః స్వచ్ఛాయయా కిం న రక్షతి ॥ 69 ॥

సత్పురుషులు అపకరించటమే అలవాటుగా గల వారికి కూడా ఉపకారమే చేస్తారు. ఇది వీరికి అలవాటు కనుక. చెట్టు తన్ను నరకటానికి వచ్చేవాడికి కూడా నీడ నిచ్చి కాపాడదా?

ప్రవత్యేవ సదా జ్ఞానం ప్రవత్యేవ సదా తపః ।
ఛిద్రం ఛిద్ర మనుప్రాప్య న చే చ్ఛాదయతి క్షమా ॥ 70 ॥

ఓర్పంటూ ఒకటి మనలోనిలిచి మనలోని లోటుపాట్లనే చిల్లుల్ని కప్పి ఉంచకపోతే మన జ్ఞానమూ, మన తపస్సూ ఎంత గొప్పవైనా ఆ చిల్లులగుండా కారిపోతాయి.

క్షమాం రక్షంతి యే యత్నాత్ క్షమాం రక్షంతి తే చిరమ్।
క్షమా ఒఒస్తే నిభృతా యేషు క్షమాస్తే సర్వకర్మసు॥71॥

ఎవరు ప్రయత్న పూర్వకంగా ఓర్పు నిలుపుకొంటారో వారు చిరకాలం భూమిని రక్షిస్తారు. ఎవరిలో ఓర్పు స్థిరంగా నెలకొని ఉంటుందో వారన్ని పనులూ చక్కబెట్ట గలుగుతారు.

మూర్ఖాః శమయితుం దుఃఖం సంరంభంతే తతస్తతః।
క్షమయైవ నిగృహ్ణంతి ధీరాః సంరంభ వర్జితాః॥72॥

మూర్ఖులు దుఃఖాన్ని పోగొట్టుకోవటానికి యిటూ అటూ చాలా పెనగులాడతారు. ధీరులు మాత్రం అలాంటి అలజడి ఏమాత్రం లేకుండానే తమ ఓర్పుతో దుఃఖాన్ని నిగ్రహించుకొంటారు.

ఆకల్యా దానిశీథాచ్చ కుక్ష్యర్థం వ్యాప్రియామహే।
న చ నిర్వృణుమో జాతు శాంతాస్తు సుఖ మాసతే॥73॥

తెల్లవారే వరకు, రాత్రి పొద్దుపోయే వరకు పొట్టకూటికై మనమెంతగా పాకులాడటం లేదు! పోనీ దానికి ఫలితంగా ఆనంద మేమన్నా కలిగిందా! మరి శాంతగుణము కలవారో ఉన్నదానితోనే తృప్తిపడి సుఖపడటం లేదా!

నాయస్యంతి శరీరాణి న దైన్య మవబుధ్యతే।
సంభవత్యపి చానందః శాంతి మభ్యస్యతాం సతామ్॥74॥

శాంతి నభ్యసించే సత్పురుషుల శరీరాలు శ్రమపడవు. దీనత అంటే ఏమిటో వారికి తెలియదు. ఆనందమూ సమృద్ధిగా వారికి లభిస్తుంది.

ప్రసీద త్యపరిస్పంది పయః కలుషితం యథా।
తథా శాంత మపి స్వాంతం ప్రసీదతి శనైః శనైః॥75॥

నీరెంత మురికిదైనా కదలకుండా ఉంటే ఎలా క్రమంగా నిర్మల మౌతుందో అలాగై 'శాంతం' అనే గుణం కూడా మనస్సును మెల్ల మెల్లగా ప్రసన్నంగా చేస్తుంది.

యత్నేన మహతా లభ్యా దాసా ద్విత్రాః సుఖాయ నః।
శాంతస్య కాలాదృష్టాద్యాః శతం భృత్యా అవేతనాః॥76॥

మనకు సుఖం కలిగేందుకు గట్టి ప్రయత్నం చేస్తే యిద్దరో ముగ్గురో సేవకులు లభించవచ్చు. శాంతానికో అలాంటిప్రయత్నం వ్యయమూ రెండూ అక్కరలేదు. దానికి కాలము, అదృష్టము మొదలైన వందలాది సేవకులు జీతం బత్తెం లేకుండా సేవిస్తారు. (శాంతవంతులకు కాలమూ, అదృష్టమూ కలసి వస్తాయి)

అపి మృద్వ్యా గిరా లభ్యః సదా జాగ ర్యతంద్రియః।
నాస్తి ధర్మసమో భృత్యః కించిదుక్తస్తు ధావతి॥77॥

మృదువైన మాటతో మనకు సేవకుడౌతాడు. సోమరితనం లేకుండా సదా మేలుకొనే ఉంటాడు. కొంచెం మాట అందిస్తే చాలు పని చేయటానికి పరుగెత్తుతాడు. ఆ సేవకుడే 'ధర్మం'. ధర్మంతో సమానమైన సేవకుడంటూ లేనే లేడు.

అర్థే నోపార్జ్యతే ధర్మో ధర్మే ణార్థ ఉపార్జ్యతే।
అన్యోన్యాశ్రయణం హ్యేత దుభయోత్పత్తి సాధనమ్॥78॥

ధనంతో ధర్మాన్ని సాధింపవచ్చు. ధర్మంతో ధనం సంపాదింపనూ వచ్చు. ఈ ధర్మము-అర్థము (ధనం) అనే పురుషార్థాలు రెండూ ఒక దానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. రెంటినీ సంపాదించి పెడతాయి.

విపణిః పుణ్యతీర్థాని విక్రేతార స్త్వకించనాః।
తృణేనా ప్యంతశో ధర్మః పర్వను క్రీయతే మహాన్॥79॥

పుణ్యక్షేత్రాలే ధర్మాన్ని అమ్మేబజారులు. దాన్ని అమ్మేవారు సొమ్మేలేనివారు. చివరకు గడ్డిపోచతో కూడా గొప్ప ధర్మాన్ని అక్కడ కొనుక్కోవచ్చును. ('పత్రం, పుష్పం, ఫలం, తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి' అన్నాడు. కృష్ణభగవానుడు. భక్తితో ఎంత స్వల్పవస్తువును భగవంతునకు సమర్పించినా అది మేరువంత ధర్మమై మనల్ని కాపాడుతుంది.)

(సశేషము)

# వేదాంత దేశికులు.

కన్నడమూలము :
శ్రీ డి. కృష్ణయ్యంగార్

అనువాదము :
శ్రీ ఆయాచితుల హనుమచ్ఛాస్త్రి యం. ఏ.,
ఆలిఘర్

(గతసంచిక తరువాయి)

తత్త్వత్రయము, వానికున్న సంబంధ స్వరూపము. దేహాత్మభ్రాంతి, స్వతంత్రాత్మభ్రాంతి, మొదలైన అజ్ఞాన నివృత్తి క్రమములు చెప్పబడినవి. పరతత్త్వము లక్ష్మీనారాయణునియందే ప్రతిపాదితమైయున్నది. ప్రపత్తికి అధికారము అకించనత, అనన్యగతిత్వము అనిచెప్పి, ప్రపదనముయొక్క అంగములు వాని లక్షణ ప్రయోజనములు విశదముగా సూచింపబడినవి. మున్ముందు అంగి అనగా ఏమి? దాని స్వరూపలక్షణము లెట్లుండును? అసాధారణ లక్షణములనగా ఏవి? వానిని అనుష్ఠించు క్రమ మెట్లు? మున్నగు విషయములు వివరింపబడినవి. సిద్ధోపాయసాధ్యోపాయముల గురించి ఉత్పన్నము కాదగిన సంశయములను, పూర్వపక్షులకై సమాధానించుటైనది. భరన్యాస మనుష్ఠించువాడెట్లు కృతార్థుడో, వివరింపబడినది. అన్యదేవతాభజనముకామ్యవ్రతాచరణము, స్వరూపనిషిద్ధమైన కార్యమని చెప్పబడినది. ప్రపన్నుడైనవాడు మోక్షప్రాప్తికై తానుగా చేయదగిన కర్మలేకున్నను, మరణ పర్యంతము, వర్ణాశ్రమ ధర్మముప్రకారము లౌకిక కర్తవ్యములను కైంకర్యదృష్టితో చేసియే తీరవలెనని చెప్పబడినది. ఇది మనుష్యునిజన్మకు సార్థకత చేకూర్చును. దీనిచే లోకక్షేమము మున్నగునవి ప్రతిపాదింప బడినవి. ఇట్లే శేషశేషి భావము, ప్రపన్నుని వర్ణాశ్రమ ధర్మానుష్ఠానము, ప్రపన్నుని అపరాధ పరిహారము, ప్రపన్నుని నిర్యాణ క్రమమునకు - ఇతరుల నిర్యాణ క్రమమునకు గల వ్యత్యాసము, ప్రపన్నుని దివ్య వైకుంఠయాత్రకై పలయు ఏర్పాటు, అర్చిరాది గతి మూలకమైన అతివాహిక సత్కారము, ప్రపత్తిప్రభావము, ప్రపత్త్యుత్తర కాలమందలి పరిస్థితి, మూల మంత్రము, ద్వయ చరమ శ్లోకముల మంత్రార్థము, ఈ విధమైన వైష్ణవ సిద్ధాంతములోనిముఖ్య తత్త్వముల నన్నింటినిరహస్యత్రయ సారములో విశదముగను, హృదయంగమముగను, ఆచార్యులవారు ప్రతిపాదించి యుండిరి.

## భూగోళ నిర్ణయము

ఇది తొమ్మిది శ్లోకములుగల చిన్న పుస్తకము ఆచార్యులవారేదీనికి వ్యాఖ్యానముకూడ రచించి యుండిరి. పురాణములలో వర్ణింపబడిన రీతిని భూమండలముగూర్చి వివరించుట వారి ఉద్దేశము. ఈ కృతి కర్తృత్వమును గురించి భిన్నాభిప్రాయములు గలవు. కొందఱు పండితుల అభిప్రాయాను సారము తత్త్వముక్తాకలాపమును రచించిన పిమ్మట ఆచార్యులవారు దీనిని రచించియున్నారు. దొడ్డమాచార్యులువారు దేశికులు భూగోళ నిర్ణయమును రచించిరని అభిప్రాయపడిరి. వారి ప్రకారము 'శిల్పసారము' కూడ ఆచార్యులవారి కృతియే. అయితే ఇది నేడు దొరకుటలేదు. వేదాంతదేశి

కులు, ఆచార్యముద్రా ప్రధానమైన తమ విగ్రహమును తామే చెక్కికొని, తమతో వాదులాడవచ్చిన శిల్పిని ఓడించిరను ఐతిహ్యము కలదు. ఆవిగ్రహమే నేటికికూడ తిరువహీంద్రపురములో పూజింపబడుచున్నది.

### 3. భక్తి ప్రధానములు బోధనాత్మకములైన కృతులు

వేదాంత దేశికులు సర్వోత్తమ కవితాలక్షణములు గల భావగీతములెన్నో రచించి యున్నారు. శ్రీ వైష్ణవులు వానిని నిత్యము స్తోత్రరూపముగా పారాయణము చేయుచుందురు. ఈ స్తోత్రములు దివ్య దేశములలో ఆరాధింపబడుచున్న దేవతల గుఱించి ముఖ్యముగా రచింప బడినవి. కొన్ని స్తోత్రములు వేదాంత ప్రతిపాదకములు. ఈ విధముగా శ్రీవైష్ణవ కవుల సంస్కృత స్తోత్రములలో వేదాంత దేశికుల వారిచే రచింపబడిన స్తోత్రములకు చాల ప్రముఖ స్థానము కలదు. ఆళ్వారుల దివ్యసూక్తులు, అనేక సందర్భములలో ఈ స్తోత్రరచనకు స్ఫూర్తి నిచ్చినవి. కాని వీనిలో కానవచ్చు మూలభూతమైన కవితా సామర్థ్యలక్షణము లన్నియు, అద్భుతరీతికి చెందినవి, పాండిత్య పూరితములైనవి. ప్రతిభాన్విత గీతరూపకములు. అటువంటి స్తోత్రముల సూక్ష్మ పరిచయమును ఇక్కడి కలుగజేసి కొందము.

### హయగ్రీవ స్తోత్రము

జ్ఞానానంద పరిపూర్ణుడు, సకల తేజో రూపుడు నయిన హయగ్రీవస్వామివారి ప్రార్థనము. ఇందు స్తోత్రరూపముగా చేయబడినది. దీనిలో ముప్పది రెండు శ్లోకములు గలవు. ఉపజాతి ఛందస్సునకు చెందినవి. వేదాంతదేశికుల వారి స్తోత్ర రచనములో ఇది ప్రథమము. తిరువహీంద్రపురము రచనా స్థానము. ఏ స్థలములో కూర్చుని, ధ్యానమగ్నులై స్తోత్రరూపముగా ఈ శ్లోకముల గానము చేసిరో, ఆ లక్ష్మీ హయగ్రీవస్వాముల దివ్యమందిరమును నేటికిని తిరువహీంద్ర పురములో మనము దర్శింప వచ్చును. హయగ్రీవ మంత్రరహస్యము ఇందు చెప్ప బడినది. ఈ స్తోత్రములోని 'సమాహారస్సామ్నాం' 'స్వతస్సిద్ధాం' మున్నగు శ్లోకములు ఆచార్యులవారిచే రచితములైన ఇతర గ్రంథములలో అతికింపబడినవి. ఈ విషయము గమనించినచో వారికి ఈ స్తోత్రముపై ప్రీతి విశేషము గాగలదని తోచును. తెంగలై శాఖకు చెందిన దొడ్డయాచార్యుల వారికి ఈ స్తోత్రముపై మమత హెచ్చు. ఈ విషయము వైభవ ప్రకాశికలో ఉగ్గడించి యున్నారు. వేలాంబూరు శ్రీనివాసాచార్యులు, శ్రీశైల తిరుమలై నంబి రాఘవాచార్యులవారు సంస్కృతములో దీనికివ్యాఖ్యానము రచించియున్నారు. తమిళ వ్యాఖ్యానమును గోపాలాచార్యులు, గార్గ్య వేంకటాచార్యుల వారు వ్రాసియున్నారు.

ఈ స్తోత్రం చివరలో ఆచార్యులవారు ఇట్లు ప్రార్థించిరి. "కుడిచేతిలో చక్రమును ఎడమచేతిలో శంఖమును, వేఱొక దక్షిణ హస్తమున ఉపదేశ ముద్రను, మఱియొక వామ హస్తమున పుస్తకమును ధరించి, ఇప్పుడు సానపెట్టిన స్ఫటికమణి భాగమువలె స్వచ్ఛమైన తెల్లతామర సింహాసనమున ఆసీనులైయున్న లక్ష్మీసమేత శ్రీ హయగ్రీవస్వాముల దివ్యమంగళ విగ్రహము నా మనస్సులో సదా నెలకొనుగాత!" (సశేషము)

# కాశ్యప జ్ఞానకాండః

(గత సంచిక తరువాయి)

— శ్రీమాన్ ఆర్. పార్థసారథి అయ్యంగార్

## అథపంచాశీతి తమోఽధ్యాయః

కల్కిః:— యుగాన్తే సర్వదుష్ట సంహారార్థం కల్కిర్భవిష్యతి. తస్య నైవభేదః. పూర్వవదేవ రూపం కృత్వా స్థాపయేత్. తస్యాపి పౌండరీకాగ్నిహోత్ర ప్రశంసనాదీని. 'కల్కినం కామరూపిణం సర్వేశం సర్వసంహారమితి' కల్కి నశ్వావాహనాదీని. పారమాత్మికమన్త్రేషు 'ధూర్షోవహన్తా' మిత్యేక వింశతిక్కృత్వా జుహుయాత్. ఏవం అవమాననాశార్థీ కల్కినం మయూరాకారే కూర్మాకారే భూతాకారే వావిమానే ప్రతిష్ఠాప్యార్చయేత్.

తా॥ యుగాన్త కాలమునందు సర్వదుష్ట సంహారమునకై భగవానుడు కల్కియై యవతరించగలడు ఈ యవతారమునందు సాయుధనిరాయుధాది భేదములు ఉండవు. రూపాది కథనము పూర్వమందు చెప్పబడినది. ఈయనకు హోత్ర ప్రశంసనాదులకు ప్రధానాగ్ని పౌండరీకము. చతుర్నామములు చెప్పబడినవి. పారమాత్మికమన కల్పమందు ధూర్షోవహన్తా, మను నొకే మన్త్రమును ఏక వింశతి వారము ఆవృతిచేసి హోమము చేయునది అవమాననాశము కోరువారు కల్కిమూర్తిని మయూరాకారము కూర్మాకారము భూతాకారములను విమానములందెందైనను ప్రతిష్ఠించి ఆరాధానము చేయవచ్చును.

అథవా దేవేశస్య విష్ణుః పార్శ్వేదక్షిణవాతో ముఖమండపే తదావరణే విశేషపరివారైః సాయుధం రామం సీతాలక్ష్మణాభ్యాం హనుమాతా చ సార్ధం వామతః కృష్ణం చ సాయుధం దేవీభ్యాం గరుడేన చ యుక్తం అన్య ప్రాదుర్భావానాం వా యథేష్టం స్థాపయేదితి. ఇతి శ్రీ వైఖానసే భాగవచ్ఛాస్త్రే కశ్యపప్రోక్తే జ్ఞానకాండే కల్కి ప్రతిష్ఠావిధిర్నామ పంచాశీతి తమోఽధ్యాయః

తా॥ లేక దేవదేవుడగు విష్ణుని మందిరమున (యేయవతారమైనను) ఆవిష్ణుదేవుని దక్షిణపార్శ్వమందుగాని ముఖమండపమందు ఆవరణ సామాన్యమందుగాని పరివార విశేషము లేకుండా సీతాలక్ష్మణులతోను హనూమనునితోను కూడిన సాయుధ రామునిగాని దేవేరులతోను, గరుడునితోను కూడిన కృష్ణునిగాని యితర ప్రాదుర్భావమూర్తులనుగాని యథేష్టముగాస్థాపించి అర్చించవచ్చును.

ఇది యెనుబదియైదవ అధ్యాయము

గమనిక :— ప్రథమముద్రణ మందింతతో 83 అధ్యాయము ముగిసినది

## అథ షడశీతి తమోఽధ్యాయః

వాసుదేవః-అథవసు దేవాదుద్భూతో వాసుదేవః సమనుష్యరూపధరణాత్ మానుషవాసుదేవః. దేవరూపధారణాత్ దైవీ వాసుదేవశ్చేతి ద్వివిధోభవతి. మనుష్యవత్ ద్విభుజం శంఖ చక్రధరం శ్యామలాంగం కిరీటమకుటాది సర్వాభరణ భూషితం తస్య దక్షిణే పూర్వవత్ రుక్మిణీం, తద్దక్షిణే హల ముసలధరం తథా బలభద్రం తద్దక్షిణే ప్రద్యుమ్నం, శక్తాభం పీతకౌశేయ వస్త్రం ద్విభుజం దక్షిణేన క్షురికాధారం వామేన కట్యవలంబన కరం, తద్దక్షిణే బ్రహ్మాణం చ యథోక్తం వాసుదేవస్య వామేపి అనిరుద్ధం ద్విభుజం ఖడ్గఖేటకధరం పుష్పాంబరధరం తస్య వామే నీలాభం శ్వేతాంబరధరం ద్విభుజం దక్షిణేనోత్తానకరం అన్యేన దండధరం సాంబం తస్యవామే తథాగరుడంచ కారయిత్వా తేషాం చ పృథక్ పృథక్ కౌతుక బింబాని కారయేత్. అథవా బ్రహ్మపద్మ మధ్యే చతుర్భుజం విష్ణుమేక మేవ కారయేత్. ఏవం మానుషవాసుదేవం దీర్ఘశాలాయాం, గోపురాకారే వా

విమానే శ్రీకీర్తివీర్య శౌర్యాదికామః ప్రతిష్ఠాప్యార్చయేత్. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధసాంబాః పంచ వీరా ఇతి విజ్ఞాయతే.

తా॥ వసుదేవునుండి కలిగినవాడు వాసుదేవుడు. మనుష్య రూపమును ధరించుటచే మానుష వాసుదేవుడనబడుటయు దేవరూపధారణముచే దైవికవాసుదేవుడనుటయు వ్యవహారముకాగా ద్వివిధముగా వాసుదేవ తత్త్వము చెప్పబడుచున్నది. మనుష్యునివలె రెండు భుజములు శంఖ చక్రములు శ్యామలాంగము కిరీటమకుటాది సర్వాభరణములు కలిగి వెనుక చెప్పిన చందముగా దక్షిణమందు రుక్మిణి హలముసలధారియగు బలభద్రుడు, ఆయనకు దక్షిణమందు రక్తాభుడు పీతకౌశేయవసనుడు ద్విభుజుడై దక్షిణహస్తమందు కత్తిని వామము కట్యవలంబితముగ చేసికొనినప్రద్యుమ్నుడు, ఆయనకు దక్షిణ పార్శ్వమునందు పూర్వోక్తలక్షణ లక్షితుడగు చతుర్ముఖుడు, వాసుదేవుని వామ పార్శ్వమందు ద్విభుజుడు ఖడ్గఖేటకధరుడు పుష్పాంబరధరుడగు అనిరుద్ధుడు, ఆయనకు యెడమపార్శ్వమున గరుడుని నిర్మించి వారలందరకు ప్రత్యేకముగ కౌతుక బింబములను స్థాపించునది. లేక బ్రహ్మపదమధ్యమందు చతుర్భుజములతో ఒకే కౌతుక బింబమును స్థాపించవచ్చును ఇట్లు మానుషవాసు దేవమూర్తిని దీర్ఘశాలము గోపురాకారము ఈ విమానములందొక దానియందు శ్రీకీర్తి వీర్య శౌర్యాదికామి ప్రతిష్ఠించి అర్చించవచ్చును. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ సాంబులను నీ పైనచెప్పిన మూర్తులను పంచవీరులని శ్రుతి చెప్పుచున్నది

ప్రథమముద్రణమందు 84 అధ్యాయం ముగిసినది.

అథ వాసుదేవం దైవికం చతుర్భుజం తథా శ్రీభూమిభ్యాం సహితం మధ్యే తద్దక్షిణవామయోః బలభద్రాద్యాంశ్చ దేవాన్ సాయుధాన్ నిరాయుధాన్వా పూర్వవత్కారయిత్వా బలభద్రదేవీం రక్తాభాం రేవతీం, ప్రద్యుమ్నదేవీం నీలాభాం రోహిణీం, అనిరుద్ధదేవీం శ్యామాభాం, రమాం, సాంబస్యదేవీం పీతాభామిన్దుకరీం, చ పద్మధరైకహస్తాః తత్తద్దేవీః తత్తత్పార్శ్వే చ కారయేత్.

తా॥ దైవికవాసుదేవుడు చతుర్భుజుడు శ్రీభూమిసహితుడై మధ్యమందుండగా ఆయనకు కుడియెడమలందు సాయుధులుగగాని నిరాయుధులుగాని బలభద్రాది దేవతలజేయునది 'బలభద్రునిదేవిరేవతిని రక్త వర్ణముగను ప్రద్యుమ్నుని దేవి రోహిణిని నీలవర్ణముగను అనిరుద్ధునిదేవిరమను శ్యామవర్ణముగను, సాంబునిదేవి ఇందుకరిని పీతవర్ణముగను ఒక హస్తమునందు పద్మధారిణులగను చేసి భర్తల ప్రక్క ప్రతిష్ఠించునది.

ఏవం దైవిక వాసుదేవం స్వదారపుత్ర పౌత్ర భ్రాతృ పూర్వస్యకులవర్ధ నాయురారోగ్యైశ్వర్య సుఖభోగ శ్రీ కీర్త్యాదికామః సోమచ్ఛందే బృహద్వృత్తే వావిమానే ప్రతిష్ఠాప్యార్చయేత్.

తా॥ ఇట్లు దైవిక వాసుదేవమూర్తిని స్వదారపుత్ర పౌత్ర భ్రాతృప్రభృతులగు స్వకులసంతతి వివృద్ధియు ఆయురారోగ్యైశ్వర్య సుఖభోగము శ్రీ కీర్తి మొదలగును సంపత్తిని కోరువారలు సోమఛందములేక బృహద్వృత్తమనను విమానములందు ప్రతిష్ఠించి అర్చించునది.

ద్వివిధ వాసుదేవస్యాపి సభ్యాగ్నౌహౌత్రశంసనాదీని కుర్యాత్. 'వాసుదేవం యదువరం భూమిహితం పురుషోత్తమ, మితి మానుషవాసుదేవస్య, రుక్మిణ్యాః పూర్వవత్. పూర్వవద్విష్ణ్వాది. పంచమూర్తి నామభిరేవ దైవిక వాసుదేవస్య తథాదేవ్యాః శ్రీభూమ్యోశ్చ-బలభద్రస్య రేవత్యాశ్చ పూర్వవత్.

తా॥ ఉభయవాసుదేవుల ప్రధానమగు సభ్యమందు హోత్ర ప్రశంసావాహనాదుల, జేయునది మానుషవాసుదేవునకు విశేషించిన చతుర్నామములు చెప్పబడునవి. రుక్మిణికి నామములు ఉక్తములే. దైవికవాసుదేవునకు శ్రీ భూములకు విష్ణ్వాదిపంచమూర్తి నామములే విహితములు. బలభద్రునకు రేవతికి నామములు పూర్వము చెప్పబడినతీరుననే

(సశేషము)

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము.

తిరుమలలోని శ్రీవారి దేవాలయ కార్యక్రమములలో 1–3–75 నుండి దిగువ పేర్కొనబడిన విధముగా మార్పులు చేయబడినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయము | 2-30 | నుండి | 3-00 | వరకు | సుప్రభాతము |
| ,, | 3-00 | నుండి | 4-00 | ,, | విశ్వరూప సర్వదర్శనము |
| ,, | 4-15 | నుండి | 5-00 | ,, | తోమాలసేవ |
| ,, | 5-15 | నుండి | 6-00 | ,, | మొదటి అర్చన (ఏకాంతము) |
| ,, | 6-00 | నుండి | 6-30 | ,, | మొదటిఘంట, శాత్తుమొర |
| ,, | 6-00 | నుండి | 12-30 | ,, | సర్వదర్శనము |
| మధ్యాహ్నం | 12-30 | నుండి | 1-00 | ,, | రెండవ అర్చన, (ఏకాంతం) ఘంట |
| ,, | 1-00 | నుండి | 6-00 | ,, | సర్వదర్శనము |
| సాయంత్రం | 6-00 | నుండి | 7-00 | ,, | రాత్రికైంకర్యములు, ఘంట |
| | 7-00 | నుండి | 10-00 | ,, | సర్వదర్శనము |
| | 10-30 | | | | ఏకాంతసేవ (ఆర్జితం) |

## శుక్రవారమునాటి పూజాకార్యక్రమము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయము | 2-30 | నుండి | 3-00 | వరకు | సుప్రభాతము |
| ,, | 3-00 | నుండి | 4-00 | ,, | విశ్వరూప సర్వదర్శనం |
| ,, | 4-00 | నుండి | 6-00 | ,, | నిత్యకైంకర్యములు |
| ,, | 6-30 | నుండి | 8-30 | ,, | అభిషేకము (ఏకాంతం) |
| ,, | 8-30 | నుండి | 10-30 | ,, | అభిషేకానంతర దర్శనం (ఆర్జితం) |
| మధ్యాహ్నం | 12-30 | నుండి | 1-30 | ,, | తోమాలసేవ (ఏకాంతం) అర్చన |
| ,, | 1-30 | నుండి | 2-00 | ,, | ఘంట, |
| , | 2-00 | రాత్రి | 7-00 | ,, | సర్వదర్శనము |
| రాత్రి | 7-00 | నుండి | 8-00 | ,, | రాత్రి కైంకర్యములు |
| ,, | 8-00 | నుండి | 10-00 | ,, | సర్వదర్శనము |
| | 10-30 | కు | | | ఏకాంతసేవ. (ఆర్జితము) |

---

గమనిక :— 1. సహస్ర కలశాభిషేకము బుధవారమున ఉదయం 7-00–10-00 నడుమ జరుగును. దాని కనుగుణముగా కార్యక్రమము స్వల్పముగా మార్చబడవచ్చును.

2. గురువారమునాడు సర్వదర్శనము సాయంత్రము 5–30 గం॥ లకే పూర్తియగును. రాత్రి 7–30 గం॥ నుండి 9–30 వరకు పూలంగిసేవ జరుగును.

3. పై కార్యక్రమములలో సమయానుకూలముగాను, ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును.

4. నిత్యార్చన గృహస్థులు మొదటి అర్చన సమయముననే అనుమతింపబడుదురు.

పేష్కార్ శ్రీవారి ఆలయం, తిరుమల.

# శ్రీ ఆనందనామ సంవత్సర ఉత్సవాదులు

మార్చి

| | | |
|---|---|---|
| 11– 3–75 | మంగళవారము | మహాశివరాత్రి, శ్రీ కపిలేశ్వరస్వామివారి సన్నిధిలో నందివాహనోత్సవము |
| 12– 3–75 | బుధవారము | శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవ ధ్వజారోహణం |
| 15– 3–75 | శనివారము | మీనసంక్రమణం |
| 16– 3–75 | ఆదివారము | శ్రీ కోదండ రామస్వామివారి గరుడోత్సవం |
| 19– 3–75 | బుధవారము | శ్రీ కోదండ రామస్వామివారి రథోత్సవం |
| 20– 3–75 | గురువారము | శ్రీ కోదండ రామస్వామివారి అవభృథోత్సవం చక్రస్నానం ధ్వజావరోహణము |
| 21– 3–75 | శుక్రవారము | శ్రీ శాలనాచ్చియార్ ఉత్సవారంభము |
| 23– 3–75 | ఆదివారము | తిరుమల శ్రీవారి తెప్ప ఉత్సవ ప్రారంభము |
| 26– 3–75 | బుధవారము | నాగులాపురం శ్రీ వేదనారాయణస్వామి సూర్యసేవారంభం |
| 27– 3–75 | గురువారము | హోళీపండుగ, మదనపూర్ణిమ, తిరుమల శ్రీవారి తెప్పోత్సవం పూర్తి శ్రీశాలనాచ్చియార్ పంగున్యుత్తర శాత్తుమొర, శ్రీ గోవిందరాజ స్వామి పూలంగి సేవ |
| 8– 4–75 | మంగళవారము | తాళ్ళపాక అన్నమాచార్యవర్ధంతి |

---

# చందాదారులకు విజ్ఞప్తి

### సప్తగిరి మాసపత్రిక సంవత్సరము చందా రు 6

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో ఈదిగువ పేర్కొన్నసంఖ్యవారి చందా 30–4–75 తేదికి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనినప్రకారము, మనియార్డరు కూపనునందు తమచందా సంఖ్య పూర్తివిలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేదీ దరిమిలా పత్రిక పంపబడదు.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 12 | 152 | 215 | 264 | 343 | 506 | 759 | 777 | 795 | 814 | | |
| 46 | 160 | 217 | 272 | 363 | 514 | 760 | 778 | 796 | 815 | | |
| 53 | 161 | 219 | 276 | 434 | 740 | 761 | 779 | 797 | 816 | | |
| 64 | 163 | 225 | 277 | 436 | 741 | 762 | 780 | 798 | 817 | | |
| 63 | 168 | 228 | 288 | 437 | 742 | 763 | 781 | 799 | 818 | | |
| 74 | 170 | 232 | 296 | 439 | 743 | 764 | 782 | 800 | 819 | | |
| 70 | 171 | 233 | 302 | 441 | 744 | 765 | 783 | 801 | 820 | 834 | |
| 73 | 172 | 247 | 304 | 444 | 745 | 766 | 784 | 802 | 821 | 835 | |
| 86 | 174 | 251 | 312 | 445 | 746 | 767 | 785 | 803 | 822 | 836 | రు. పై |
| 97 | 186 | 254 | 317 | 451 | 747 | 768 | 786 | 804 | 823 | 851 | |
| 109 | 196 | 255 | 318 | 454 | 748 | 769 | 787 | 805 | 824 | | 6–00 |
| 115 | 199 | 256 | 319 | 482 | 749 | 770 | 788 | 806 | 825 | | |
| 110 | 205 | 257 | 320 | 496 | 750 | 771 | 789 | 807 | 826 | | |
| 112 | 206 | 259 | 323 | 499 | 751 | 772 | 790 | 809 | 827 | | |
| 143 | 210 | 260 | 324 | 501 | 752 | 773 | 791 | 810 | 828 | | |
| 147 | 211 | 261 | 326 | 502 | 753 | 774 | 792 | 811 | 831 | | |
| 148 | 212 | 262 | 327 | 503 | 755 | 775 | 793 | 812 | 832 | | |
| 150 | 214 | 263 | 328 | 504 | 756 | 776 | 794 | 813 | 833 | | |

మాసపత్రికకు సంబంధించిన చందాసొమ్మును మనియార్డరుల రూపమున 'సంపాదకుడు టి. టి. దేవస్థానం, తిరుపతి, అను చిరునామాకే పంపవలయును. చెక్కులు అంగీకరింపబడవు. ఇతర చిరునామాలకు చెల్లించబడు సొమ్ము విషయమున జరుగగల లోపమునకు పత్రిక కార్యాలయము ఎంతమాత్రమును బాధ్యత వహించదని గమనింప ప్రార్థన.

సంపాదకుడు

# సన్మార్గానుష్ఠానము

వేద ధర్మముల ననుష్ఠించుచు కర్మపథమున చరించుచు - భౌతిక లాలసతకు లొంగక పరమేశ్వరాను గ్రహసిద్ధికొఱకు పరితపించిన జాతి భారత జాతి. భారతదేశమునకు కర్మభూమియనెడి నామాన్తరముగూడ కలదు. కర్తవ్యనిష్ఠ గలవారు భయదూరులై యుందురు. వారిని పిఱికితన మావహింప జాలదు. మనోబలము దండిగవారికుండును. వారు సర్వదా ధీరులై వ్యవహరించు చుందురు. జీవితము నందేర్పడెడి యొడుదొడుకులు వారిని వణకింప జాలవు. తొట్రుపాటులకు తావీయక. తటపటాయింపులమాట తలపెట్టక, గట్టిగా కాలూని కార్య రంగమున నిలువగల సాహసులు వారు.

గమ్యము కంటక మయముగ దోచవచ్చును. వంకర టింకరలైయున్న సందులలో గొందులలో ఇఱుకునబడి నడువ వలసివచ్చును. దారి యంధకార బంధురమే గావచ్చును. కర్తవ్యపరాయణులైన వారు వీని నన్నింటిని — సులభముగ నతిక్రమింపగలరు. వారికి గల యాత్మ విశ్వాసము అట్టిది. కర్తవ్యనిర్వహణ దీక్ష పట్ల వారికి గల - అకుంఠితమైన భక్తియట్టిది. సనాతన పవిత్ర ధర్మ శాస్త్రముల శిక్షణ ప్రభావమది. ప్రాచీన సదాచార సరళిలో మెలగుటవలన గుదిరిన దృఢచిత్త వైఖరి యట్టిది.

వేదభూమియందు జన్మించుటవలన ప్రాప్తించిన యోగ్యతయది. ఈ విశిష్టతయే యీ నేలపై తిరుగాడు వారి నందరిని నట్టి యోగ్యతముల నొనర్చినది. భగవంతుని ప్రత్యక్షముగ దిలకింపవలెనని న సరళ సాధు జీవితమును నిర్వహించుచు దివ్యదీపికల వెలుగులో పరమేశ్వర సాక్షాత్కార సంసిద్ధికి యత్నించినవారు ధన్యాత్ములు కాగలరు. నిత్యానందము ననుభవింప జాలినవారు వారే.

ఆధ్యాత్మిక మార్గము సుదీర్ఘమైనట్టిది. అది కష్టముల కాలవాలము గూడ. అయిననేమి? పరంధామునిపై పూర్ణ విశ్వాసము గల్గినవారు సుఖముగనే యా బాట వెంట పయనము సాగించి గమ్యమును చేరగల్గుట తథ్యము. భారమంతయు సర్వేశ్వరునిపై నిడుకొనినవారికి క్లేశముల వలన లవలేశమేనియు బాధ యొదవదు.

నయనములకు మిఱుమిట్లుగల్గించు మహాద్భుత తేజమును గాంచి దద్దరిల్లుట తగదు. స్థాయిగ హాయిగ సుఖము ననుభవించుటకు గల మార్గము నరయుటకన్న మిన్నయైన విజ్ఞతయేమున్నది?



'ఆర్షవిద్యాలంకార'
శ్రీ కల్లూరి చంద్రమౌళి,
గుంటూరు.

క్షణికములైన మెఱుపుల పగిది చంచలములై భ్రమించెడి - భ్రాంతిని గల్గించెడి భౌతిక సంపదల సొంపుల గాంచి మురియుట యెవ్వరి విషయమునైనను వివేకవంతమైన విషయము గానేరదు.

కష్టమో! సుఖమో! ఓటమియో! గెలుపో! దైవానుగ్రహమున ప్రాప్తమున్నదేదో! అది మాత్రమే నరునకు లభ్యమగుచుండును. తద్భిన్నమైన దాని నెట్లేని యందుకొనవలెనని యత్నములు సాచుట వెఱ్ఱివాని లక్షణము. పొందవలసియున్న ఫలమును - పొందనీయక నిరోధించు వారెవరును లేరు. దైవసంకల్పమనుల్లంఘనీయము కావుననే సుఖదుఃఖముల యెడ నరుడు నిర్లిప్తుడై వ్యవహరించుట లెస్స. ద్వంద్వములకు లొంగరాదు. మానవుడు వీని కన్నింటి కతీతుడై వ్యవహరింపవలయును. భగవంతుడే సర్వమునకు దిక్కని ఎవ్వరు నమ్మికొందురో! వారి మనుగడ కల్యాణమున కాకరమగును.

కక్షలను కాంక్షింపరాదు. విభజన భావమును విసర్జింపవలయును. భేదముల నణచివేయు టుచితము. వంచనాపద్ధతిలో డాంబిక విధానముతో గర్వదృష్టితో పూజలు చేయించుకొనుటకై ప్రాకులాడెడి కొందఱు 'మఠాధిపతుల' దరిజేరుటకు తహతహలాడుట తగదు. రాజకీయ నాయకమ్మన్యులకు సహితము సుదూరముగనే యుండుట సముచిత విషయము. వీరిరువురును రంగుల మార్పుగల యొకే శ్రేణికి చెందిన పెద్దలు.

నవనాగరికులమని విఱ్ఱవీగు వారందఱును లవమాత్రమేని విశ్వసింపదగదు. మూఢాచారములను నిర్దాక్షిణ్యముగ నిరాకరించుట శ్రేయము. కొంటెకోణంగుల వెక్కిరింపులు కొక్కిరింపులు లెక్కసేయదగదు. సుఖదాయకమైన ధర్మాచరణమునకు బూనుకొనిన వారి నివి యేమియు చేయజాలవు.

ప్రేమించువారు, ద్వేషించువారు, పొగడువారు, తెగడువారు బహురీతులకు చెందినవారు, పలువురు జీవితమున నెదురగుచుందురు. వీరి నెవరి నెట్లు భావింపవలెనో గుర్తించి, వ్యవహరింపవలెను. భగవంతుని వరప్రసాదమనదగిన మానవజీవితము మహాద్భుతకరమైనట్టిది. దాని నిజతత్త్వము నరసి యోగ్యతతో మెలగవలయును. పశుప్రవృత్తికి వశము గారాదు.

తామసిక, రాజసిక, స్వాత్త్విక గుణముల ప్రోవుగా సృష్టింపబడిన మానవుడు వీని కతీతుడై పారమార్థిక చింతనతో జీవితమును కొనసాగించినపుడే సర్వేశ్వరానుగ్రహమునకు పాత్రుడు కాగలడు. మానవత యప్పుడే మధురత లీనును. మనుగడ నాడే సఫలమగును మరువరాని మరువదగని మహత్తర విషయమిది. నిజతత్త్వమును గుర్తింప గలిగినవారే మహనీయులు కాగలరు.

మానవుని యందంతర్గర్భితముగ పశుత్వమున్నది. మానవత్వమున్నది. దివ్యత్వమున్నది కాని! ఏనాడును నరుడు పశుజీవితలోలుడు గారాదు. పాశవిక ప్రవృత్తి నదుపులో పెట్టగలిగిన వారే ఘనులు మానవత్వమును నిలబెట్టుకొనుటకు మానవత గల్గియుండుటకు యత్నించిననాడే దివ్యత్వసిద్ధికి బాటలుకన్పించును. జీవిత పరమావధియైనది దివ్యత్వము మాత్రమే. నిశ్చల నిర్మల శాశ్వతత్వమునకు మూలబీజమైన యీ క్రమమును మనుజులవలంబింపవలసి యున్నది.

ప్రతివారి హృదయము నందంతర్గర్భితముగా దాగియున్న దివ్యత్వమప్పుడే యుద్దీప్తమగును. ఆ దివ్యత్వము నారాధించినవారే దివ్యులుగ దీపించుదురు.

దైవ స్వరూపమును. దైవనామమును భిన్న భిన్న రీతులలో నెవరెవరెట్లు ఆరాధించి నప్పటికిని, ఎవరెవరెట్లు స్మరించి నప్పటికిని భగవంతుడొక్కడే. పరబ్రహ్మ స్వరూపమొక్కటే. ఏ నామములతో కీర్తింపబడినను - ఏ రూపములతో నారాధింపబడినను భగవాను డొక్కడే యనుటకీ వేదమంత్రమే సాక్ష్యము.

"ఏకం సద్విప్రా బహుధావదన్తి"

అట్టి భగవానుని త్రికరణ శుద్ధిగా నమ్మి ధర్మ బద్ధ వర్తనమున సంచరించువారు ధన్యతములు కాగలరు. పావనులౌదురు. అమరత్వము నందుకొందురు.

భారతీయుల కిట్టి యాధ్యాత్మిక జీవిత రీతియే పరమాదర్శ ప్రాయమైనదని యభివ్యక్తమగు చున్నది. తాదృశమైన జీవితమును నావిష్కరించు కొనుటయే మన కర్తవ్యము. చరిత్రకందని అతి పురాతన కాలమునుండియు భారతదేశము మహర్షులకు నిలయముగా యోగులకు పుట్టినిల్లుగా వర్ధిల్లు చున్నది. ఈ పుణ్యభూమిలో మహాత్ముల మందిరములే అవతారమూర్తుల యావిర్భావముల కాలవాలములుగా నున్నవి. పరమహంసలకు పట్టుగొమ్మలై యలరారుచున్నవి. ఆధ్యాత్మిక తత్త్వాధారమొక్కటే ఈ గడ్డ కళకళలాడుట కాయువుపట్టు. యుగయుగముల నుండి తరతరములనుండి భారతభూమి ఈ దివ్యసందేశమునే విశ్వమున కందించు చున్నది. మన ఆచార విచారములే, సంస్కృత నాగరకతలే, మన పాలిటికి దివ్య దీపికలు.

వేదములు పరమేశ్వరుని విజ్ఞానమను కొంటిమి. అందుండి సమావిష్కృతమైన సనాతన ధర్మమే మనకు నిత్యపవిత్రాచారము. నిర్మల జీవితసారము. మనమార్యులము. మనది ఆర్ష సంస్కృతి.

'కృణ్వంతు విశ్వమార్యమ్'

అనునదే మన దేశపావనవిశ్వ సందేశము. సనాతన ధర్మప్రబోధము నొక్కదానినే జీవిత ధ్యేయముగా నెంచిన జాతి యిది. ఆర్యజీవిత విధానావలంబులుగా - సదాచార సత్సంప్రదాయ పరులుగా— భారతీయులు పురాతనకాలము నుండి మనుగడను కొనసాగించుచు వచ్చుచున్నారు

వర్తమానమేల కలుషితము కావలెను? కర్మభ్రష్టతయేల ప్రాప్తింపవలయును? ధర్మధ్వంసమేల జరుగవలయును? జాతిలో స్తబ్ధత యేల యేర్పడవలయును? సమాజమున సంక్షోభమేల తల యెత్తవలయును? శాంతి యంతరించుటేల? న్యాయము విస్మృతి పథమున బడుటేల? సత్యము మరుగున దాగుకొనుటేల? మానవు డధఃపతితుడగుటేల?

కారణ మన్నింటి కొక్కటే. జీవితమునకు పునాదులైన నీతిశీలములు జాతిలో సడలుట దుర్దోషము. కన్నింటికి హేతుభూతమైన ఈ స్థితిని సవరింపవలసియున్నది

నరుడా! ఉత్తిష్ఠ.

జాగ్రదవస్థలను పొంది - సంయమన శీలుడవై ముందునకు సాగుము. ఆత్మబల సంయుతుడవైన నిన్నెదిరించు వారెవ్వరు నుండరు. పరార్థ వర మార్గములను సాధించు పరమేశ్వరానుగ్రహము సిద్ధించును భావనఫలించును. శుభము లభించును ★

# శ్రీ కృష్ణ జననము



'ప్రసన్నకవి'
శ్రీ శంకరంబాడి సుందరాచారి
కాంచీపురం

(గత సంచిక తరువాయి)

కత్తియిదిమేటి వీరుల కుత్తుకలను
కత్తరింపఁగ గలిగెః నిక్కరణి నొక్క
కలికి కంఠమ్ము ద్రుంపఁగ గాదుః నీవు
ఘనత మసివడుదీన, నాగ్రహము విడుము.

పరిణయంబాడి మగనితో పయనమైన
వధువు దేవకి ప్రేమ పాత్రయగును;
వధకుఁదగనిదిః ధర్మమొప్పని విధమ్ము
పాపమూలము, స్త్రీహత్యవలదు వదలు.

ప్రాణమది నీది వేరొక్క ప్రాణిఁజంప
భద్రపడబోదు; దైవమ్మె బాధ్యుఁడరయ
ప్రాణ రక్షణకును దాని బాపుటకును,
ప్రాణికాలేఁడు, పరమితత్వార్థమిద్ది.

జనన మరణమ్ములవి లోకసహజమైన
సత్యములు; జన్మతోఁగూడ చావుఁబుట్టి
చక్కఁబెఱుగుచునుండుః అశాశ్వతమ్ము
చప్పు కాయమ్ము, మృద్భాండసమమెయగును.

నేడు కాకున్న రేపైన నిశ్చయముగ
నీ నిలువు కూలు నిలువదుః నీదుశక్తి
నిలుపనెంచిన నిలువును నిలువదద్ది
నింగివలకకయున్నను, నిజము వినుము.

కర్మబద్ధుఁడు జీవుఁడు; కార్మికతన
కాయమునువిడి మరియొక కాయముఁగొని
కాపురముసేయుః ఎంతటి ఘనుఁడెయైన
కర్మబద్ధుండెయగును లోకమునవెందు

కాయమునువిడి వేరొక్క కాయముఁగొన
కలుగు సుఖమెద్ది? మోక్షసుఖమ్మె సుఖము.
కాంచ నగుదాని బహుపుణ్య కర్మవలన
కాన తెలివంది పాపకూపమునఁ బడకు.

నిత్య సత్యమ్ములివి దిద్ద నేరకున్న
నీదుబుద్ధిని నీకర్మనీదియంచు
నిన్ను వదలెద; కానియోయన్న! మనసు
నిలిపి నాపైని నా తుది పల్కు వినుము.

పలికె నష్టమసుతుఁడె నీ పగతుఁడగుచు
పట్టి నిను జంపునంచు నంబరముః కాన
వాని జంపుము; చెల్లెలి ప్రాణముఁగొన
వలయు కారణమేమి? యిప్పట్టునందు?

కన్నబిడ్డలు బలియైరి; కట్టుకున్న
కాంతయైననుదక్క నిక్కరణి నీవు
కరుణఁజూపిన; నీమేలు మరువ నెపుడు
కాదనకు; జాలిఁగొని సతిఁగావ వయ్యా

ప్రథమమందినయంత నే ప్రతిశిశువును
పడగఁ ద్రోయుదు, తప్ప నీ పాదయుగళి,
వాడు కొనవచ్చు వారిని వలఁసి నట్లు
ఎదకు పూనిన మానిన బాధపడను.

అంచుప్రార్థింప కంసుఁడావంత తగ్గి
అడితప్పఁడు వసుదేవుఁడంచుఁదెలిసి
పట్టువిడిచెల్లెలిని బావపఱకులవిని
వదలిపెట్టెను వధకుపాల్పడని యట్లు,

కాలమొక కొంతగడువఁగ గర్భమంద
కనెను దేవకి మొదటపాపనిః తడయక
కరములను వాని నిడికొని త్వరితముగను
కదలిచనె వసుదేవుడు గంసు కడకు,

అయ్య! తొలికాన్పు; నీ చెలియనుఁగుబిడ్డ
అరయమేనల్లుఁ డగునీకుః ఆడితప్పి
యగయనేనొట నీ చేతి కప్పగించి
యురుగవచ్చితి కొఁననన్న నసుపుమనియె.

ప్రథముండేకదఁ పాపమీపాపచంప
నదలిపెట్టుదు గోపికొమ్మ; పట్టితెమ్ము
వసుధఁబడినంత యష్టమ్ము, వానిజంపి
పగనుసాధింతునాకాశవాణినెదిరి.

అనుచుఁ గంసుఁడు దారుణుఁడైయా విసుగును
పూతమొనర్పక వదలిన యబ్బురపడి
యాతనికి మ్రొక్కి వసుదేవుఁ డాసువార్త
నరిగి పత్నికిఁజెప్పి మరలెనువడి.

ఆత్మశాంతింప నంతభయమ్ముమాయ
నష్టమునిజంపి సుఖపడ నాశుభసమ
యమునకై వేచియుండిన యసురముఖ్యు
డైన కంసుని దైవకార్యమ్ముబూని

కలిసి పల్కంగవచ్చె నాకసమువదలి
కదలి సుమౌని: మ్రొక్కి స్వాగతమునిచ్చి
కనక పీఠస్థుగావించి గౌరవించి
కంసుఁడాతని వచ్చిన కారణమ్ము

నడుగనామౌని, యొక్కరహస్యగాథ
నరయ జెప్పఁగవచ్చితినయ్య! వినుము:
అచట వ్రేపల్లెలోని వారందరు సుర
లంచుఁదెలియుము. గొల్లలటంచు భ్రమయ

వలదు: రాక్షస రాజుల ప్రబలులగుచు
వర్తిలగనీక చంపిభూభారమడఁచ
వసుధపై జన్మఁగొనిరి గోపాలురనఁగ;
వారినొక కంటఁగనిపెట్టవలయు నీవు

పాలకుఁడునందుఁడగును వ్రేపల్లెకెల్ల;
వానిచుట్టమె నీచెలి పతిగనొప్ప
వాఁడువసుదేవుఁడును; నీదు వంచమెలఁగు
వారు నీవారు కారని పలికి చనెను.

అమరముని వాక్కులవ్వి హృదంతరమ్ము
నందుచిచ్చుల నర్పింప, నదియుఁగాయ
మంతటనుబర్వి పెనుమంటలై దహింప
నతఁడు మతిసెడ ధృతిసెడ నాసలేని

ఆగ్రహమ్మున నున్మాదుఁడై చరించి
అనుగు తండ్రిని, శూరసేనాదులబెలు
నడఁచి, రాజ్యమ్మునంతయు నాక్రమించి
అడ్డులేనట్టుమించి సర్వాధికారి

అగుచు వసుదేవుఁబత్నితో వగలముంచి
యట్లె బంధించి కారాగృహమ్మున, చంపి
వదలిబుచ్చిన శిశువును, పగను బెంచి
పాపలందఱి హతమార్ప పట్టుఁబట్టె!

కరుణఁబోనాడి కఠినాతి కఠినుఁడగుచు
కండ కావరమున గసి కందువులను
కంఠముల ద్రుంచి యార్గురి కాలరుద్రు
కరణి కంసుఁడు బలిగొన, గంటి నీళ్ళ

కడవలై తోఁప గన్గవ కలఁతలబడి
కాలయమనముఁడననొప్పు కంసుఁజేతి
కత్తికందీయ నేడవ కాన్పునుగన
గర్భవతియయ్యె దేవకీ కాంతమరల!

ఆమె కడుపును బొంద శేషాంశము, హరి
అందకను బిల్చియోగ మాయను విధించె:
అవని కేగుము: కారాగృహమ్మునందు
అడఁగియున్నది దేవకి: ఆమె కడుపు

నందు బెంపఁడుచున్న శేషాంశనుగొని
అరుగు వ్రేపల్లెకును; యాదవాన్వయమణి
యనఁగ బేర్గన్న నందుని యభినివేశ
మందు రోహిణి వసుదేవునకుఁగు పత్ని

నరసి, యామె గర్భమ్ములోన నమరనిలిపి
అతిరహస్యముగను, యశోదాత్మజవయి
యవతరజన్మను గొనుము: విన్నవని భక్తి
నాది శక్తిగ బూజించి యభినుతించు.

అనిన శిరసావహింతు నీ యాజ్ఞనంచు
హరికి వందనమిడి యోగమాయయునుగదలి
అతివ దేవకిలోని శేషాంశముఁగొని
యమరనిల్పెను రోహిణియందు నెమ్మి.

అజ్ఞులందఱు యోగమాయా విలాస
మరయఁగాలేక చెడె కడు పంచునాడ,
అష్టముఁడుగూడ కడుపులో నషపడని
యంచు గంసుఁడు లోనెంచె నల్పుఁడగుట.

అదను గనుఁగొని శ్రీహరి యాత్రపడుచు
అసుర సంహార పుణ్యకార్యమును దీర్ప
అతని యంశమ్ములన్నియు నావహించి
అనఘు వసుదేవు జ్యోతిర్మయాంగుఁజేసె;

అట్టి దివ్యాంశములు చక్కనైక్యమంది
యతనివిడి దేవకీ గర్భమందు దావు
నంద సర్వాంగ సుందరియై జ్వలించి
యామె చెఱనెల్లవెలిగించె నతిశయించి.

హరియటుల దేవకీగర్భమందు నిలువ,
అంబికాపతియును, గమలాసనుండు,
అమరులును మహామునులును నవనికి దిగి
అంజలి ఘటించి గర్భస్థుఁడైన హరిని,

సత్యమా: సత్యమానస! సత్యగమ్య!
సత్యనిత్యాత్మకా! సత్యసత్యనాథ!
సర్వజనబాంధవా: విశ్వసౌఖ్య సదన!
శరణుమాధవ! గోవింద శరణు శరణు!

ఆది మధ్యాంతరహిత! మహానుభావ!
అవని బహురూపములనంది యవతరించి
అడఁచి దుష్టులశిష్టులనాదరించి
నట్టి నీ పుర్వాచరితదయామయమ్ము.

సాధుజనపోషకా! నిన్ను శరణువేడు
సజ్జనులు నిర్భయమ్ముగ సంచరించు
శక్తిఁగొందురు: వారితో సతము నీవు
సంచరింతువు సుజనరక్షకుఁడ వగుట.

భవజలధిదాట నావ నీపాదయుగళి,
వసుధవర్థిల్ల నీనామభజన వలయు,
పరము నీ చేతిసొమ్ము: చేఁబట్టువాని
ప్రబలమగు శక్తి భక్తియే పామరులకు

అయ్య! జన్మములేని వాఁడయ్యు నీవు
యబల కడుపున లోక కళ్యాణమునకు
నడఁగి పుట్టగనుండుట యబ్బురమ్ము!
అవతరింపుము దుష్ట సంహారమునకు.

అంచుగీర్తించి, ప్రార్థించి యట్టి దివ్య
ననఘు కడుపున దాల్చెడు నట్టిపుణ్య
మందిశోభిల్లు దేవకి నభినుతించి
యరిగిరందఱు పరమమోదాత్ములగుచు.



బాలల శీర్షిక ......

# ఆర్యుల కథలు

## పాతివ్రత్య మహిమ

పతివ్రతలమను గరువముతో నున్న త్రిమూర్తుల పత్నుల గర్వమును బోగొట్ట నారదుఁడు గులకరాళ్ళను లక్ష్మీ, సరస్వతీ, పార్వతుల కిచ్చి 'గుగ్గిళ్ళుగా వండి పెట్టు' మనగా మాకు 'సాధ్యముగా' దనినారు.

'భూలోకమున అత్రిమహాముని ధర్మపత్ని యనసూయ మహా పతివ్రత! ఆమె చేయగల' దని చెప్పగా సరియే! చూతమని ముగురమ్మలు మూల మూలల రహస్యముగ దాగి పొంచి చూచుచున్నారు.

నారదుఁడిడిన గులకరాళ్ళ ననసూయ క్షణములో గుగ్గిళ్ళుగా మార్చితెచ్చినది. నారదుఁడు ఆనందించినాడు. దేవులు ఎవరిండ్లకు నారు పరాభవముతోఁ బోయినారు.

పిదప నీముగ్గురు రాణులు తమ పతులను ప్రోత్సహించి యామెను పరాభవింపఁ బంపరా! పంపినారు. వచ్చినారా మహనీయులు మునిరూపాలతో అత్రి యాశ్రమమునకు, పొందినారతిధి పూజలను.

అత్రి భార్య వారిని భోజనమున కాహ్వానించినది. వారా! 'నగ్న స్త్రీహస్తోదకము పోయనిదే మేమాతిథ్యమును గైకొనమని, మాకది యాచారమ'ని నుడివినారు.

ఆ పతివ్రత మొదట కంగారుపడినను నిదానముగా ఆలోచించి వీరు త్రిమూర్తులుగా గుర్తెరింగి పీటలపై వారిని గూర్చుండఁబెట్టి 'స్వాములారా! తమ కోరిక నెరవేర్చుదాన' ననెను.

పిదప జలము చేతిలో నుంచుకొని "నేనే పతివ్రత నైనచో నీ మునిసత్తములు బాలకులగుదురు గాక"! అనగా యా యుదక సంప్రోక్షణ మాత్రమున ముప్వురు బాలకులై యేడ్వదొడంగిరి. అంత నా దంపతులువచ్చి వారినాడించి పాలుపట్టితొట్టెలోఁ బరుండఁబెట్టి లాలిపాడు చున్నారు. నారదముని వలన నీ సంగతివిన్న లోకపాలకురాండ్రు లక్ష్మీ–పార్వతీ–సరస్వతులు వచ్చి యా యనసూయ పాదాలపైఁబడి 'పతిభిక్షని' మ్మని ప్రార్థింపగా ఆమె పతియానతిచే త్రిమూర్తులకు యథారూపము లిచ్చినది. అంత వారి యనుగ్రహమున వీరికి దత్తాత్రేయుఁడను పుత్రుఁడు జన్మించెను.

ఈ కథ దారుణము. త్రిమూర్తులను బాలకులనుగా మార్చుట – వారి పత్నులచే బ్రతిమాలబడుట – వారికన్న శక్తివంతురాలనని స్థాపించుకొనుట గదా!

## గురుభక్తి

లోగడ స్త్రీకి గల పాతివ్రత్య శక్తిని గుర్తించినాము. ఇంక శిష్యునకుగల గురుభక్తి మహిమను దెలియుదము.

మునుపు పైలమహర్షి నుదంకుఁడను విద్యార్థి సేవించి సకల విద్యల నందెను. అణిమాద్యష్ట సిద్ధులఁగూడ నందెను.

విద్యానంతరమున 'గురుదక్షిణయేమి?' యని గురు—గురుపత్నుల నడిగెను. ఆ గురుపత్ని 'పాతాళమందలి పౌష్యమహాదేవి కుండలములు కావలెను—తె' మ్మనగా ఉదంకుఁ డట్లేయని వారికి నమస్కరించి పాతాళమునకు బోవుచుండగా దారిలో ఎద్దుపై నెక్కి నొక మహనీయుడు కన్పడి 'దీని గోమయమును దినిన నీకుఁ గార్యసిద్ధి యగు' నని చెప్పగా నటులాతడు తినెను. మహారాజును చూచి యాతని భార్య కుండలములను గోరెను. వెంటనే యారాజు తన దేవి దగ్గరకుఁబోయి తాను చెప్పినట్లు చెప్పి యా కుండలముల గైకొని పొమ్మన్నాడు. ఉదంకు డామె దగ్గరకుఁబోయి విషయము నివేదించుటకు ఆ దేవి యెచటను గన్పడక పోవుటచే రాజు చెంతకు వచ్చి "నీవే యాకుండలములను దెప్పించి యిమ్ము. నాకు నీ దేవేరి గన్పడలే" దనెను.

అంత పౌష్యుని వలన "వెనుక తాను గోమయ భక్షణచేత అశుచి యగుటచే మహాపతివ్రత తనకి గన్పడలేదని తెలిసి పాదప్రక్షాళన ఆచమనము చేసి పోయి వెతుకగా ఆమె కన్పడి యా కుండలముల నిచ్చి యిట్లనెను.

"నాయనా! ముని కుమారా! తక్షకుఁడీ కుండలముల నపేక్షించు చున్నాఁడు. వాఁడా! మాయావి. వీటిని పదిలముగా గొనిపొమ్ము" అనెను. అంతలో పౌష్యుడు వచ్చి "అయ్యా! నీవతిథివి! మాయింట భుజించిపొ'మ్మని చెప్పగా "సరియే!" అని తినుచుండగా యాయన్నమున తలవెంట్రుక రాగారోసి "యంధుఁడవగుమని" పౌష్యుని శపించెను. రాజు "నాకు శాపంబిచ్చినావు గాన నీ వనపత్యుండవగు మనిశపించెను. చివఱకు పౌష్యునితో నీ శాప మల్పకాలమున బోవునని విద్యార్థి త్రిప్పెను

ఆ కుండలములగొని యుదంకుఁడు గురుపత్నికీయ సంబరమున బోవుచుండగా సంధ్యావందనమునకై యొక శుచి ప్రదేశమున నా కుండలముల నుంచగా తక్షకుఁడు అదృశ్యరూపుఁడై యాకుండలముల గైకొని పారిపోయెను. భూవివరమునుండి పాతాళమునకుఁ బోయెను. విద్యార్థియు నాగలోకమునకేఁగి నాగపతుల నెల్లర స్తుతింపగా నొక దివ్యపురుషుఁడేతెంచి సంతసించి "ఓయీ! యిట నున్న యశ్వకర్ణంబున గట్టిగా నూదు" మనెను. ఊదగా దానికి భయపడి తక్షకుఁడు కుండలములను దెచ్చి యాఛాత్రున కిచ్చెను.

వాటిని గొనిపోయి ఋతుస్నాతయయిన గురుపత్ని కిచ్చెను. ఆమె సంబరమున పతితో బాటుగా సంతానము గలుగ నాశీర్వదించెను.

చూడుడు బాలులారా! ఇన్ని కష్టాలబడియు లోకాంతరమున కేఁగియు నుదంకుఁడు గురుదక్షిణ నిచ్చెను. అందుకు గురుభక్తియే కారణము.

*Edited and Published an behalf of the T. T. Devasthanams by K· Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager, T. T. D. Prsee, Tirupati.*

# ముఖ్య ప్రకటన

—※※※※—

తిరుమల తిరుపతి దేవస్థానముచే ప్రచురింపబడు, శ్రీ వేంకటేశ్వర పద్మావతీదేవి మొదలగు వర్ణచిత్రముల వెలలు ఈ క్రింది విధముగ 24-1-75 నుండి మార్చబడినవి

| | | సైజు | పూర్వపుధర | క్రొత్తవెల |
|---|---|---|---|---|
| 1 | శ్రీ వేంకటేశ్వరస్వామివారు | 28 × 20" | 2-00 | 3-00 |
| 2. | ,, | 20" × 14" | 1-00 | 1-50 |
| 3. | ,, | 15" × 11" | 0-62 | 1-00 |
| 4. | ,, | 11" × 7" | 0-25 | 0-50 |
| 5. | ,, | 7" × 5" | 0-07 | 0-25 |
| 6. | శ్రీ పద్మావతి అమ్మవారు | 28" × 20" | 2-00 | 3-00 |
| 7. | ,, | 20" × 14" | 1-00 | 1-50 |
| 8. | ,, | 15" × 11" | 0-62 | 1-00 |
| 9. | ,, | 11½" × 7½" | 0-25 | 0-50 |
| 10. | ,, | 7" × 5" | 0-07 | 0-25 |
| 11. | శ్రీ వేంకటేశ్వర పద్మావతి సంయుక్తచిత్రము | 20" × 14" | 1-00 | 1-50 |
| 12. | ,, | 10" × 7½" | 0-13 | 0-50 |
| 13 | వజ్రకవచ వేంకటేశ్వరస్వామి | 20" × 14" | 1-00 | 1-50 |
| 14. | ,, | 11" × 7½" | 0-25 | 0-50 |
| 15 | వేంకటేశ్వర మాహాత్మ్యము (52 చిత్రముల పటము) | 24" × 18" | 1-50 | 1-50 |
| 16. | ఉభయనాచ్చియార్లతో మలయప్పస్వామి | 20" × 10" | 1-00 | 1-50 |
| 17 | ముత్యాల కవచములో శ్రీ వేంకటేశ్వరస్వామి | 20" × 18" | 1-00 | 1-50 |

ఎల్లరు ఈ మార్పును గమనింప ప్రార్థన

పి. యస్. రాజగోపాలరాజు

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు.

తి. తి. దేవస్థానములు, తిరుపతి.